# మిసిమి

మాస పత్రిక

ఏప్రిల్ - 1999

వెల - రూ॥ 8/-



# ముఖచిత్రం 'నిద్రిస్తున్న యువకుడు'



జోసెఫ్ రైట్

సంప్రదాయ ప్రామాణిక రచయిత ప్లినీ ప్రకారం అసలు మొదట చిత్రలేఖనం ఈజిప్టులో పుట్టింది. లిడియాకు చెందిన గైగీజ్ ఒక జ్వాలకు కొంచెం దూరంలో నిలబడి ఉన్నాడు. అప్పుడతని నీడ ఒక గోడమీద పడింది. దానిని చూసిన అతడు మసి బొగ్గుతో దాని స్థూలాకారాన్ని గీసాడు. ఈ విధానాన్ని తరువాత గ్రీసు కొరింత్‌లో పరిపూర్ణం గావించారు. ఆవిధంగానే ఒక కొరింత్‌కు చెందిన కన్య, నిద్రిస్తున్న ఓ యువకుని ఛాయను అతని వెనుక ఉన్న గోడమీద చిత్రిస్తున్నది. మహాకులాలుడైన (Master Potter) జోషియా వెడ్జ్‌వుడ్ కోసమే అసలు రైట్ ఈ చిత్రాన్ని చిత్రించింది.

ఇక్కడ రైట్ అనుసరించిన శైలి నవ్యప్రామాణిక సంప్రదాయశైలి (Neo-classical style) సౌందర్యాన్ని ఆసరా చేసుకొని ఖచ్చితమైన స్థూల ప్రొఫైల్‌గా చిత్రాలను చూపించాడు.

నిద్రిస్తున్న యువకుని చిత్రం, రైట్ అంతకుముందు రోమ్‌లో ఉన్నప్పుడు ఎండిమియాన్ లనేయుడుకుని (Classical Relief) ఆధారంగా స్కెచ్ వేసుకొని, ఆ తరవాత ఈ నిద్రిస్తున్న యువకుని చిత్రం వేశాడు. ఎండిమియాన్ అసాధారణమైన అందగాడు. అతడు ఏచిత్రకారునికైనా తగిన మోడలే. అటువంటి వానిని దృష్టిలో పెట్టుకొని చిత్రించడం చాల బాగుంది.

'ఇంద్రచాపం'తో ప్రాదేశిక చిత్రం రైట్ చిత్రాలలోకెల్ల దీనిని అత్యంత సుందర చిత్రంగా అభివర్ణిస్తుంటారు కళారసాస్వాదులు. ఇందులో ప్రత్యేకత ఏమంటే కాంతికి రైట్ ప్రతిస్పందించిన తీరు. "కాంతి ప్రభావాలు" (Lighting effects) హరివిల్లులో ఎలా దర్శితాలవుతున్నాయో గమనించండి. ఈ చిత్రం అతడు చనిపోయేవరకు అతనివద్దే ఉంది. ఆ తరువాత అతని వారసుల దగ్గర నుంచి 1913లో అతడు పుట్టిన నగరం ఆర్ట్‌గ్యాలరీ కొంది.

## చిత్రకారుడు

జోసెఫ్‌రైట్ (1734 - 1797) డెర్బీలో పుట్టాడు. అతడు తన జీవన యానాన్ని ముఖచిత్ర (Portrait) చిత్రకారుడుగానే మొదలు పెట్టాడు. మొదలుపెట్టడం అయితే అలా మొదలు పెట్టాడు గాని, ఆతరవాత వెంటనే "కాంతి ప్రభావాలు" (Lighting effects) పైకి మనస్సు మరల్చాడు. వాటి వివిధ ప్రభావాలను దృశ్యం చేశాడు. ఈ "దీపాల వెలుగు" లే ఆయనకు కీర్తినార్జించి పెట్టాయి.

అతడు చివరి దశలో ఆంగ్ల గ్రామీణ స్థల దృశ్యాలను చిత్రించడంలో కాల్పనికత, ఔద్వేగితలు ప్రవేశపెట్టాడు. ఇవి తరువాతి తరం ఆంగ్ల స్థల చిత్రకారులకు మార్గదర్శకాలయ్యాయి.

# మిసిమి

"All that we are is the product of what we have thought"
is "We are what we think." - Dammapada.

సంపుటి 11 ఏప్రిల్ 1999 సంచిక 4

వ్యవస్థాపక సంపాదకుడు : డాక్టర్ రవీంద్రనాథ్ ఆలపాటి

## విషయసూచిక



విడిప్రతి రూ. 8/- వార్షిక చందా రూ. 100/-

ముఖచిత్రం : 'నిద్రిస్తున్న యువకుడు'

---

Printed & Published by BAPANNA ALAPATI at Kala Jyothi Process Ltd.,
1-1-60/5, R.T.C. X Roads, Musheerabad, Hyd-20. Ph. 7645536
e-mail : misimi_m@hotmail.com
http : //www.misimi.com

సంపాదకుడు : అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి

మార్చి మిసిమిలో వచ్చిన ఇన్నయ్య 'పోస్ట్ మాడర్నిజమ్' వ్యాసానికి

# అబ్బూరి ఛాయాదేవి ప్రతిస్పందన

'మిసిమి' మార్చి 1999 సంచికలో ''పోస్ట్‌మాడరనిజం' అనే వ్యాసాన్ని చదివాక పోస్ట్ మోడర్నిజం అంటే ఏమిటో కొంతవరకు స్పష్టమైనప్పటికీ, డా. యన్. ఇన్నయ్య గారు తమ వ్యాసంలో చేసిన కొన్ని వ్యాఖ్యలు ఆమోదకరంగా లేవనిపించింది.

1 పోస్ట్ మోడర్న్ ఉద్యమంలో ''కలిసిపోయిన'' వాటిలో (పాప్ ఆర్ట్, ప్లూరలిజమ్ వంటి వాటిలో) 'ఫెమినిజం' కూడా ఉందని ఇన్నయ్యగారి వ్యాఖ్య! ఫెమినిజం ఏదో కొత్తదనం కోసం, కేవలం పాతవాటికి విరుద్ధంగా వెళ్లాలను కోవడం కోసం, ఒక కొత్త ఫాషన్‌గా పుట్టినది కాదు. స్త్రీలను తరతరాలుగా పురుషాధిక్య సమాజం అణచివేస్తున్నదన్న చారిత్రక సత్యాన్ని గుర్తించి, స్త్రీల హక్కుల కోసం, స్త్రీల వ్యక్తిత్వ నిరూపణ కోసం రూపొందిన ఉద్యమం అది. మన ఆంధ్ర దేశంలో స్త్రీజనోద్ధరణ వీరేశలింగం ప్రభృతుల సంస్కరణ వాదంలో ప్రారంభమైంది. తరవాత చైతన్య వంతులవుతున్న స్త్రీలు స్వయంగా స్త్రీవాద ఉద్యమాన్ని ప్రారంభించారు, కొనసాగిస్తున్నారు.

2. ''పోస్ట్ మాడరనిజం'' అంటున్నవారు.... ''శాస్త్రీయ పద్ధతులను విస్మరించారు. శాస్త్రీయ పద్ధతి ఎప్పటికప్పుడు తప్పులు దిద్దుకుంటూ, వ్యక్తి భావాలకు గాక, సామాన్య పరిశోధనా రుజువులకు విలువ యిస్తుందనేది మరిచి పోయారు. మరొకటి కనిపెట్టే వరకూ లోగడ కనుగొన్నది సత్యంగా వుంటుంది. ఏదీ శాశ్వతం కాదు...'' అన్నారు ఇన్నయ్య గారు. వారు అంటున్న 'శాస్త్రీయ పద్ధతి' ముందుగా ఎవరో ఒక వ్యక్తి కనిపెట్టినదే, ప్రతిపాదించినదే - ఐన్‌స్టైన్‌గాని, సి.వి.రామన్‌గాని, పికాసోగాని, జిడ్డుకృష్ణమూర్తి గాని, ఆ వ్యక్తులు ప్రతిపాదించిన వాటిని కొంతమంది అంగీకరించినప్పుడు అది శాస్త్రంగానో, శైలిగానో, తత్త్వంగానో ఆమోదకరం అవుతుంది. వ్యక్తులు లేనిదే సమాజం లేదు. ప్రతి సమాజంలోనూ కరడు కట్టిన సంప్రదాయాలనూ, సత్యాలుగా నమ్మకం కలిగించిన శాస్త్రీయ పద్ధతులనూ తిరస్కరించే వ్యక్తులు కొందరు ఎప్పటికప్పుడు పుడుతూనే ఉంటారు. వారి ప్రోద్బలంతో ఉద్యమాలు ప్రారంభమవుతూనే ఉంటాయి.

''మత పవిత్ర గ్రంథాలలో చెప్పింది తుదిమాట'' కానట్టే, ''శాస్త్రీయ పద్ధతి'' అనుకునేది కూడా తుదిమాట కాదు. శాస్త్రీయ పద్ధతి శాశ్వతం కాదని ఇన్నయ్యగారే అంగీకరించారు కదా. అందుచేత, సంప్రదాయాలూ శాస్త్రీయ పద్ధతులూ - అంటే సమాజంలో ఉన్న పరిస్థితులు బంధనాలు అనిపించినప్పుడు వాటినుంచి బయటపడటానికి మార్గాన్ని మనిషి నిత్యం అన్వేషిస్తూనే ఉంటాడు. మార్పుకి ప్రయత్నిస్తూనే ఉంటాడు. అది అభివృద్ధికి దారి తీయవచ్చు, లేదా, పతనానికి దారి తీయవచ్చు, ఏ స్థితీ శాశ్వతం కాదన్నది మాత్రం సత్యం.

3. '' ఏ మతం వారు ఆ మత గ్రంథాలు, నియమాలు ఆధారంగా జీవితాన్ని నడుపుకోవాలి. అలా చేస్తున్నప్పుడు పరస్పర విరుద్ధమైనవి వస్తే ఏ మౌతుంది?'' అని ప్రశ్నించారు ఇన్నయ్యగారు.

*(తరువాయి 115 వ పేజీలో చూడండి)*

# ఆధునికానంతరతా వాదం

– అన్నపరెడ్డి వెంకటేశ్వరరెడ్డి

ఏ యుగం (age) అయినా తన ''ప్రతిమ'' (image) ను ముఖ్యంగా తన కళా సాహితీ రూపాలలో ప్రక్షేపిస్తుంది. ఇంకా సామాజిక, ఆర్థిక, రాజకీయ రంగాలలో గూడ ఆ ప్రతిమ ఫలిస్తుంది. అందువల్లనే ఈ ప్రతిమ, ఈ రూపం, ఫలాన యుగానికి చెందింది, - మధ్యయుగాలకు చెందింది, ఫ్యూడల్ యుగానికి చెందింది, పునర్వికాస యుగానికి చెందింది, ఆధునిక యుగానికి చెందింది, ఆధునిక యుగానంతరానికి చెందింది, అని ఉరామరుకుగా గుర్తించ గలుగుతున్నాం.

ఇహ మన వ్యాస పరిధికి వస్తే, ఫ్యూడల్ యుగానికి చెందిన ప్రతిమలను, అంటే 1850 పారిశ్రామిక విప్లవానికి ముందరి కళాసాహిత్య, సామాజిక, సాంస్కృతిక ప్రతిమలను ఆ తరవాత వచ్చిన ఆధునిక (Modern) రూపాలు, ప్రతిమలు ఆయారంగాలలో త్రోసి రాజన్నాయి. ఈ ఆధునిక యుగం 1950ల వరకు సాగిందని చెప్పవచ్చు. ఆ తరువాత, ఆధునిక ప్రతిమలను కాదని, లేదా ఆధునికతలోని కొన్ని అంశాలను కొనసాగించి, ఆధునికానంతర ప్రతిమలు వచ్చాయి. అలా వచ్చిన ప్రతిమల, ఆకృతుల ద్వారా ఆధునికానంతరతా యుగ భావనను అర్థం చేసు కోవలసి ఉంటుంది.

ఏ విషయమైనా, దానిని నుంచి వెలుపలికి వచ్చి చూసే వాడికి అర్థం అవుతుంది కాని, అందులో లీనమై ఉన్నవాడు దానిని పట్టుకోలేడు మనం ఆధునికానంతరులం గనుక అందులో ఉంటూనే దానిని పట్టుకోవడం కష్టమే.

ఆధునికానంతరతా వాదం అనేక రీతుల్లో అనేక సాంస్కృతిక వస్తువులను, దృగ్విషయాలను తడుముతుంది. అది అనేక రీతుల్లో మనకు దర్శన మిచ్చినప్పటికి, దానిని మనం ముఖ్యంగా మూడు రీతుల్లో గుర్తించ వచ్చు.

మొదటిది, అది ఇరవయ్యోశతాబ్ది ఉత్తరార్థంలో వచ్చిన అనేక సాహిత్య, కళా పరిణామాలకు ఆఖ్యాయిక అయింది. ఇటువంటి ఆధునికానంతరతకు ఆరంభ బిందువును, ఇరవయ్యో శతాబ్ది పూర్వార్థంలో పరిఢవిల్లిన కళా సాంస్కృతీ రూపాలలోని ' ఆధునికత' (modernity) లో చూడ వచ్చు.

రెండోది నూతన ఆర్థిక సామాజిక వ్యవస్థా రూపాల ఆవిర్భావంలో కనిపిస్తుంది. నూతన సామాజిక, ఆర్థిక రూపాలు రెండో ప్రపంచ మహా సంగ్రామానంతరం (1939 - 45) నుంచే కనిపించాయి. ఈ శతాబ్దం తొలి దశకాలలో జరిగిన పరిశ్రమల వికాసం రాశిప్రజావిఫణి (Mass market) ఆవిర్భావం, పెరిగిన, యంత్రాల ప్రాబల్యం, ప్రయాణ, ప్రసార సాధనాల అభివృద్ధి ఆధునికీ కరణకు సంబంధి ంచింది. ఈ ఆధునికీ కరణ, ఈ రెండో రీతి ఆధునికానంతరతకు దారి తీసింది.

ఇహ మూడోది సిద్ధాంత పరమైన 'రాత' ల్లో, తత్సంబంధ పర్యాలోచన (reflections) ల్లో కనిపిస్తుంది. మామూలుగా ఈ రాతలు మొదటిదైన కళా సాంస్కృతిక రంగాలను, రెండోదైన ఆర్థిక మార్కెట్ రంగాలను తమకు వస్తువులుగ చేసుకొన్నాయి.

ఆధునికానంతరతా వాద ఛాయలు మనకు అన్నిరకాల కళారూపాలలో సాంస్కృతిక ఆచరణలలో (Cultural practices) కనిపిస్తాయి అయితే ఈ 'ఛాయలు' అంతకు ముందరి 'ఆధునికత'కు ప్రతిచర్యగా పొడసూపినవనే విషయం అందరూ అంగీకరించే విషయమే

అయితే ఈ ప్రతిచర్య ఎలా జరిగింది? 'ప్రతిచర్య' అంటే అంతకు ముందరి రూపాలతో, ఆకృతులతో పూర్తిగా విడవడి పోయి, వేరే 'సత్వం'గా, వివిక్తంగా, వేరుగా ప్రారంభం కావడమా? లేక అంతకు ముందరి రూపాలలోని 'ఎదురు తిరిగే', అనియంత్రిత, అస్పష్ట, అర్థరహిత అంశాలను ఏరుకొని వాటిని ''కొనసాగించడమా?''

ఆధునికతా కళా సాహితీ రూపాలలోని 'అనియంత్రిత'కు మరలడమే ఆధునికానంతరతా వాదం అంటాడు ఆల్‌ఫ్రెడ్ జెరీ. ఉదాహరణకు అతని "Pata Physics" లోని 'దహించే కోపం', డాడా సృష్టించిన 'విగ్రహ ధ్వంస క్రీడ', భావివాదం, 'నీటి మడుగు సుడిగుండాలలోని గతిశీలత'లను గ్రహించ వచ్చు. ఈ ప్రకారం చూస్తే ఆధునికానంతరతా వాదం 'ఆధునికత'ను పునర్నవీకరించడమే కాని, ఒక రకంగా కొనసాగింపే కాని, అధిగమనం గాదు, భంజకం కాదు.

ఈ విషయాన్ని జా- ఫ్రాంకోయిస్ లియోటార్డ్‌లో చూడవచ్చు. ఆధునికానంతరతా వాదాన్ని గట్టిగా బల పరిచినవారు శిల్పకళా విమర్శకులు ఛార్లెస్ జెంక్స్, సాహితీ విమర్శకుడు ఇహబ్‌హసన్‌లు. వీరి ప్రకారం 'ఆధునికతా' రూపాలలో 'విప్లవించే శక్తి', ఏదిరించే శక్తి' గడ్డకట్టుకు పోయాయి. అందువల్ల ఆరూపాలు ఆచారాలుగా, సంస్థాగత రూపాలుగా ఘనీభవించి పోయాయి. ఈ రకంగా సంస్థాగతాలైన ఆధునికతా రూపాలనుంచి ఆధునికానంతరతా వాదం. ఎన్ని రకాలుగా అధిగమించి, ఆవిర్భవించింది వీరు ఎత్తి చూపారు. జెంక్స్ దృష్టిలో అయితే, అంతర్జాతీయ ఆధునికతా వాదంలోని సంవేదనీయత (sensibility), అధికారిక (authoritarian) శైలులు బీటలు వారి, దాని నుంచి నూతన వైవిధ్య శైలులకు, ప్రకార్యాలకు (functions) ద్వారాలు తెరచుకున్నాయి. ఆధునికతా వాస్తుకళను, ఆధునికానంతరతా వాస్తుకళతో పోలిస్తే, ఇది అనేకశైలులను - పాత వాటిని కొత్తవాటిని - మేళవించుకొంది.

కళా సంబంధమైన ఆధునికానంతరతా వాదానికి నిర్వచనాలు అనేకం ఉన్నాయి. కాని వీటన్నింటికి కేంద్రక మనదగిన అంశం ఒకటి ఉంది. అది : సౌందర్య స్వయం చాలక విలువ (value of aesthetic autonomy)ను నిరాకరించడం. అయితే చాలమంది కళాకారులు కళను కళపరంగానే నిర్వచిస్తారు. కళ విలువ కళలోనే ఉంది. ఈ విలువను నిర్వచించడానికి వెలుపలి అంశాన్ని దేనినీ ఆశ్రయించ రాదు. కాంట్ తన (Critique of Pure Reason లో చెప్పినట్లుగా అది నిష్కామం (disinterested). మన ఆశల, ఆశంసల కంటె అది స్వతంత్రమైంది. అందుకని కళను అనేక నిరాకరణలతో నిర్వచించవలసి వచ్చింది. మూర్తిమత్వ (personality) నిరాకరణ, ఔద్దేశికాభివ్యక్తి నిరాకరణ, (expressive intention), వాస్తవ ప్రపంచాన్ని ప్రతిబింబించాలనే లక్ష్యనిరాకరణ, సామాజిక ప్రమాణాలను ప్రతిబింబించాలనే ఆశయ నిరాకరణ - అంటే వీటిని వేటిని కళ ప్రతిబింబించరాదనడం. ఇది ఆధునికతా వాదం కళా పరంగా.

అలాంటప్పుడు, కళాత్మక ఆధునికానంతరతా వాదాన్ని 'ఆధునికతావాద నిరాకరణల'ను నిరాకరించేదిగా చెప్పవచ్చు. అంటే కళ స్వయం చాలక విలువను, ప్రపంచం నుంచి దాని వేర్పాటుతనాన్ని (seperation from the world) నిరాకరించడం అన్నమాట. అప్పుడు ఈ నిరాకరణకు అర్థం ఏమిటంటే, ఆధునికతా వాదం కాదన్న కళా - సమాజాల మధ్య సంబంధానికి మరలడమే. అంటే ఆధునికతలోని 'శుద్ధత' నుంచి 'సంక్లిష్టత'కు, శైలిలోని 'సమగ్రత' (configuration) నుంచి బాహుళ్యానికి, స్వయంచాలకత లేదా సంగతత్వం (connectedness) నుంచి ఆపాతితకు (contingency) ఆధునికతానంతరతా వాదం పయనిస్తుంది.

ఇహ సామాజిక ఆర్థిక వ్యవస్థను చూస్తే, ఇరవయ్యో శతాబ్ది మధ్యవరకు ఏలిన ఆధునికానంతరత సామాజిక, ఆర్థిక, రాజకీయ 'ఆధునికత' (modernity) విచ్చిపోవడాన్ని (post modernity) సూచిస్తుంది. బాగా ఎదిగిన, వికసించిన పెట్టుబడి దారీ వ్యవస్థ, ఉత్పత్తికి అవసరమైన సంస్థలకు పరిమితం కాక, తన దృష్టిని వినిమయ సుఖాల (Pleasures of consumption) సంస్థల మీదికి కేంద్రీకరించింది. అంతకు ముందు ఎదురు తిరిగిన ఏ కొద్దిమంది కళా కారులకో పరిమితమైన ఆధునికతా విలువలు, ఆధునికానంతరతా వినిమయ సమాజం ( ఉత్పత్తి సమాజం మీది నుంచి దృష్టి వినిమయ సామాజం మీదికి మారింది) లో సామాన్యీకరణం చెందడంతో, ఆధునికానంతరతా వాద పరిస్థితులేర్పడ్డాయి. మారిన ఆర్థిక పరిస్థితిని సౌందర్యీకరించడమే ''ఆధునికానంతరత'' అంటారు. ఉత్పాదనమీది నుంచి వినిమయం మీదికి మారిన దృష్టి అటు కళాసాహితీ సాంస్కృతిక రంగాలను గూడ పరివర్తిస్తుంది.

ఈ సౌందర్యీకరణ ఏమిటి? కళలో ఒకప్పుడు సాధించబడిన సాంస్కృతిక స్వయం చాలకత ఈనాడు జీవిత రంగంలోకి ప్రవేశించింది. లోగడ స్వైర కల్పనలలోను, ఊహల లోను నర్తించిన విషయాలన్నీ ఇప్పుడు వాస్తవ జీవితంలోని నిజాలు కావాలని ఆధునికానంతరతా శీలం డిమాండ్ చేస్తోంది. వాటిని జీవితంలోనూ అనుభవించాలి.

అప్పుడు మార్క్స్ సిద్ధాంతం ఏమవుతుంది? ఆర్థిక ప్రకార్యం సామాజిక జీవితాన్ని నిర్ధరిస్తుందని, ప్రతి ఆర్థికతకు ఉత్పాదక శక్తులు, ఉత్పాదక రూపాలు కేంద్రకాలని మార్క్సిజం అంటుంది. ఈ 'ఆర్థిక భూమిక' కంటె, ఇప్పుడు, సంస్కృతి, ప్రాతినిధ్య ప్రక్రియలు (process of representation), పునరుత్పత్తి (reproduction)లు ప్రాముఖ్యం వహించాయి. మార్క్స్ వీటిని క్రింద గాట కట్టివేసి, గౌణ నిష్పాదనలు (secondary emanations) అని తోసి వేశాడు.

సమకాలీన సమాజంలో సామాజిక సంకేతాల (social signs) ను, గుప్త సంజ్ఞలను (codes), భాషలను సామాజిక విశ్లేషకుడు నేర్చుకోవాలి. ఎందుకంటే, ఇవ్వాళ, సాంకేతిక అనుకరణ సాధనాల (means of simulation) లో, పునరుత్పత్తిలో, వచ్చిన విప్లవం, విదళనం, వాస్తవికతల మీద సంకేతాల ఆధిపత్యాన్ని చెబుతున్నాయి. ఈ ఆధునికానంతరతా ప్రపంచంలో అనుభవ వాస్తవికతలను సంకేతాల ద్వారా చెబుతున్నారు. వాస్తవిక, సామాజిక, ఉత్పత్తులైన 'వాస్తవికతా ప్రతిమల' మధ్య సంబంధం పూర్వపు సమాజాలను నిర్వచించేది. కాని ఇప్పుడో వాస్తవికతతో ఎటువంటి సంబంధం

లేని ఒక స్వయం సమృద్ధ (self sufficient) అవాస్తవిక ''అల్పసదృశత'' (simulation), ఒక ప్రతిమ, ఒక సంకేతం, ఒక గుర్తు సమాజాన్ని నిర్వచిస్తున్నాయి.

ఆర్థిక ఆధునికానంతరతను నిర్వచించే మరో పరిస్థితి ఉంది అది వస్తు ఆధార ఆర్థికత నుంచి సమాచారం (information), సేవలు (services) మీద ఆధారపడ్డ సంస్కృతిగా మారడం. ఇటువంటి ప్రపంచంలో ప్రతిమలు (images), శైలులు styles - వీటిని అనుసరించే వస్తువులతోపాటు, విఫణి ఆర్థికత (market economy)కు, దోపిడికి, వస్తువులై పోతున్నాయి. దీనితో, వాస్తవంలో, ఆర్థిక క్రియ (Economic activity) మొత్తంగా సంకేతాల (signs)ను పునరుత్పత్తుల (reproductions) ను, తయారుచేసి, వాటిని పదిమందికి తెలియజేయడం మీద కేంద్రీకృతమైంది. వార్తలు, వాక్యాలు (texts), చలనచిత్రాలు, సంగీతం, సాఫ్ట్‌వేర్‌లే ఆ సంకేతాలు, ఉత్పాదనలు. ఈ వస్తువులంటే 'వినిమయ జనరాశి' ఆవురావురు మంటున్నది ఇది అసలు సంస్కృతినే నాశం చేస్తుందేమోనని పెట్టుబడి దారీ ఆధునికత భీతిల్లి పోతోంది

ఆధునికతలో విలువలు స్పష్టంగా నిర్వచించబడి ఉంటాయి. ఆధునికతా రాజకీయాలలో శాశ్వతానుబంధ విలువలు పాదుకు పోయి ఉంటాయి. వర్గవైషమ్యం లేదా వర్గ విభేదం ప్రాతిపదికగా ఎవరి వర్గానికి వారు అంటిపెట్టుకు పోయి ఉంటారు కాని ఆధునికానంతరతా పరిణామాలను చూస్తే, ఇవి శాశ్వత విలువలకు, అనుబంధాలకు, వర్గవైషమ్య రాజకీయాలకు దూరంగా జరిగి అంతకంటె అధికంగా సంకీర్ణమైన, చెల్లాచెదురైన అనుబంధ, అధికార ''అర్థం'' మీద, లైంగికత, వయస్సు, లింగం సాంస్కృతిక తాదాత్మ్యతల మీద, ఆధారపడిన ''తాదాత్మ్యతా రాజకీయాల'' (identity politics) కు దారితీసాయి.

నేటి భారత రాజకీయం దీనికి మంచి ఉదాహరణ. ఆధునికానంతరతా వాదం పాశ్చాత్యం మనకు వర్తించదు అనే వారు ఈ అంశాన్ని గుర్తించ గలరు.

ఈ చెప్పిన పరిస్థితికి ఉత్పాదక ఆర్థికత నుంచి వినిమయ ఆర్థికతకు జరిగే మార్పు తోడు కావడంతో, ఆధునికానంతరతా ప్రక్రియ వేగం పెరుగుతుంది. వినిమయ ఆర్థికతలో వస్తువులను, సహజావసరాలను తీర్చడానికి కాక ప్రకటనలు, ప్రచారం కారణంగా ఏర్పడిన ''కృత్రిమావసరాల''ను, గౌణావసరాలను తీర్చడానికి, తయారు చేస్తారు.

జీవితంలోని ఎక్కువ భాగాన్ని ''అంగడి తర్కం'' (lagic of market Place) లోకి లాక్కొచ్చే శక్తులు తీవ్రతరం కావడంలో ఆధునికానంతరత ఉంది. ఆధునికానంతరతా విశ్వ ఆర్థికత అశాశ్వత అభిరుచులను, నిలకడ లేని ఆర్థిక స్థితులను, ఉద్యోగితనమూనాలలో అభద్రతను, వర్గ బాహుళ్యతను, రాజకీయ వైవిధ్యాన్ని ప్రవేశపెట్టింది.

హార్వే ఎక్కడో ''కాలా (దేశ సంహతి'' - space - time compression) న్ని గురించి మాటాడాడు. దూరం హ్రస్వమైన ఈ ప్రపంచంలో 'దూరాభారం' అనేది ఆర్థిక క్రియకు ఏరకమైన ఆటంకం కాబోదు. ఇవ్వాళదేశాన్ని (space) దాన్నధిగమించడానికి పట్టేకాలంతో కొలుస్తున్నాం. ''పోష్టాఫీసు ఇక్కడకు ఐదునిముషాల దూరంలో ఉంది'', అంటున్నాం. అలా దూరాన్ని కాలంలో

చెబుతున్నాం. అలాగే ఇప్పుడు లాభాన్ని ఉత్పత్తి పెరుగుదల పరంగా కాక, ''టర్నోవరు కాలం'' లో లేదా ''వినిమయ రేటు పెరుగుదల కాలం'' లో కొలుస్తాం. ఇది ఆధునికానంతరతా లక్షణం.

మానవ విధిని ( human destiny) చెప్పే దివ్యకథనాలను త్రోసి రాజని, వాటిస్థానాల్లో లౌకిక సార్వత్రిక కథనాలను ఆధునికత ప్రవేశ పెట్టింది. ఈ లౌకిక సార్వత్రిక వృత్తాంతాలను ''అధి వృత్తాంతా'' (Metanarratives) లంటారు. ఇవి అనివార్య రేఖీయ ప్రగతి భావనతో మానవ చరిత్ర పయనిస్తుందనే స్ఫురణను కలిగిస్తాయి హెగల్ ప్రకారం ఆ లక్ష్యం ఆత్మపూర్ణంగా చైతన్యంగావడమైతే, మార్క్స్ ప్రకారం సార్వత్రిక మానవాళి విమోచనం. ఈ సార్వత్రీకరించే ''అధి వృత్తాంతాలు'' కుప్పకూలి పోవడంతో అధునికానంతరత ప్రవేశిస్తుంది. అంటే ఒకే ఒక బృహత్ అధివృత్తాంతం స్థానంలో వివిధ చరిత్రల బాహుళ్యత, స్థానిక వృత్తాంతాలు చోటు చేసు కొంటాయి అవి వేటికవే. వీటిని ఏకీకృతం చేసి, వాటన్నింటికి కలిపి ఒకే సారాంశాన్ని చెప్పలేం. మానవ ప్రపంచంలో 'అనువృత్తి' (conformity) నివైధీకరణాన్ని నిరోధించడం ద్వారా, ఈ తాదాత్మ్యతల బాహుళ్యానికి, వివిధంగా కథనం చేయడానికి ఆధునికానంతరతా కళా సంస్కృతులు దోహదం చేశాయి.

సాంస్కృతిక జీవితంలో సాధరణీకృత ఆత్మచైతన్యం (generalised self conscious) పెరగడం ఆధునికానంతర స్థితి లక్షణాలలో ఒకటైతే, విమర్శకరాతల్లో ఆధునికానంతరత ఒకశైలిగా లేదా సంవేదనీయతగా ఆవిర్భవిచండం ఆస్థితి ముఖ్య లక్షణం చివరకు అది ఎలా తయారైందంటే, ఆధునికానంతరతా వాదం గురించి రాసిన రాతల రూపాలు - అవి తత్వం లో కావచ్చు, సామాజిక సిద్ధాంతాలతో, సాంస్కృతికాధ్యయనాలలో, సాహితీ విమర్శలో కావచ్చు - ఆధునికానంతరతా విలువల పైన లేదా గుణాలైన దాని వస్తువులనే, సచేతనంగా, బాహాటంగా ప్రచలితం చేశాయి.

ఇంతకుముందు విడివిడిగా విరుద్ధంగా ఉన్న విషయాలు, రూపాలు కలగా పులగం కావడం ఆధునికానంతరతా స్థితి అయితే, ఆధునికానంతరతా సిద్ధాంతం దాని విషయం (subject) తో మమేకం అవుతుందని ఆశించవచ్చు. సిద్ధాంతం, వస్తువు రెండూ ఒకటే అవుతాయి. స్త్రీ అధ్యయనాలలో, సాంస్కృతిక, తాత్విక కాల్పనిక రచనలలో, కళలలో, విమర్శనలో ఉన్న వివిక్తత, వేరుతనాలు, 'స్పష్టత' తో - రాజీపడుతున్నాయి. ఇప్పటికీ సనాతన విద్యా సంబంధ రాతల్లో కొనసాగుతున్న ''తటస్థ వాణి'' ( Neutral voice), దూరం నుంచి చూసే దృక్కోణం (distance perspective) లను ఈ రాతలు తిరస్కరిస్తాయి. ఆధి కారిక ఏకవాణి (Authoritative single voice) మూసివేతకు, బహువాణితో (polyphony) పూరించడానికి, సహకరించే, ఘర్షించే వాణుల మధ్య సంభాషణా రూపాలను అది అందించవచ్చు. చదవడంలో కలిగే అనుభవాన్ని బహుళీకరించడానికి, సంక్లిష్టం చేయడానికి అది ఆధునిక వైతాళికుల ఉపాయాలను ఉపయోగించ వచ్చు.

''చేయబోయే దానికి నియమాలను తయారు చేయడానికి నియామాలు లేకుండా పనిచేయడం'' అని చెప్పినట్లుగా, ఆధునికానంతరతా వైతాళికుల స్థానంలో అటువంటి రాతలు నిలబడడానికి ప్రయత్నిస్తాయి.

## అవైదిక మతాలు, కుల వ్యవస్థపై

# డా॥ బి. ఎస్. ఎల్. హనుమంతరావు

## రచనలు - ఒక పరిశీలన

*(గతసంచిక తరువాయి)* — టి. రవిచంద్

మహాయాన బౌద్ధానికి ఆంధ్ర జన్మస్థానమనడానికి ఎక్కువ చారిత్రక ఆధారాలు ఉన్నాయని, మహాసాంఘిక, చైత్యక సిద్ధాంతాలు క్రమంగా మహాయానశాఖ ఆవిర్భావానికి దారితీశాయని, మహాయాన బౌద్ధులకు ప్రామాణిక గ్రంథమైన ''ప్రజ్ఞాపారమిత శాస్త్రం'' ఆంధ్ర బౌద్ధుల మేధాకృషి జనితమని డా॥ బి. ఎస్. ఎల్. హనుమంతరావు అభిప్రాయం. మహాసాంఘిక బౌద్ధులకు ధాన్యకటకం (అమరావతి) ప్రధానకేంద్రస్థానమని, మహాసాంఘికుల్ని స్థానికంగా చైత్యకవాదులనిపిలుస్తారని, వారే చారిత్రక బుద్ధుడికి 'లోకోత్తర' లక్షణాలు ఆపాదించి, నైతిక ప్రవర్తనకు స్వయం కృషికి ప్రాధాన్యతను ఇచ్చి, బౌద్ధంలో పూజా విధానాన్ని, ఆరాధనని ప్రవేశపెట్టి ఆకర్షణీయమైన మతంగా పెంపొందించారనే ఆయన అభిప్రాయాల్ని పరిశోధనలు బలపరుస్తున్నాయి. మహాయాన బౌద్ధాన్ని గొప్ప ప్రజా ఉద్యమంగా పెంపొందించి, దానికొక మహత్తరమైన దార్శనిక వ్యవస్థను (మాధ్యమిక వాదాన్ని) అభివృద్ధి చేసినవాడు ఆచార్య నాగార్జునుడని అనేక దేశ, విదేశీ పండితుల అభిప్రాయంతో వారు ఏకీభవిస్తారు. నాగార్జునుడు దక్షిణాపతంలోని ''వేదలి'' ప్రాంతం వాడని లంకావతారసూత్రం పేర్కొంటుంది. వేదలి ఆంధ్రలోని ఒక గ్రామం, ఆంధ్ర బ్రాహ్మణుల్లో 'వేదుల' అనే ఇంటిపేరు గలవారున్నారు; ఆంధ్రలోని ఇంటిపేర్లలో చాలావరకు స్థలనామాలేనంటూ, తమ ఇంటిపేరు భట్టిప్రోలు అని, అదిచాల ప్రసిద్ధిచెందిన బౌద్ధ తీర్థమని పేర్కొన్నారు (My family name is Bhattiprolu, the famous Buddhist Thirtha)[11]. నాగార్జునుడు ఆంధ్రుడనే వాదాన్ని ప్రముఖ ఆంధ్రబౌద్ధ పండితుడు డా॥ జి.వి. కృష్ణారావు ''విగ్రహ వ్యావర్తిని''ని (నాగార్జునుని దార్శనిక గ్రంథాల్లో ముఖ్యమైనది) సంస్కృతం నుండి తెలుగులోకి అనువాదంచేసి, దానికి రాసిన ముందుమాటలో పేర్కొన్నారు. భారతీయ చరిత్రలో నాగార్జునుడిది అద్వితీయస్థానమని (unique place), ఆయన ఆంధ్రుడని డా॥ బి.ఎస్.ఎల్ అంగీకరించారు. నాగార్జునుడి రచనల్లో ఆంధ్రలో బాగా ప్రచారం పొందిన రచన ''సుహృల్లేఖ'' (స్నేహితునికి లేఖ) అని పిల్లలు దాన్ని కంఠస్థం చేస్తుండేవారని, పెద్దలు జీవితాంతం అధ్యయనం చేసేవారని చైనా యాత్రికుడు ఇత్సింగ్ క్రీ.శ. ఏడవ శతాబ్దంలో ఆంధ్రదేశంలో పర్యటించినప్పుడు రాశాడు.

నాగార్జునుని తర్వాత ప్రసిద్ధుడైన మహాయాన దార్శనికుడు ఆర్యదేవుడు దక్షిణ భారతదేశస్థుడని, ఆంధ్రుడయి వుండవచ్చునని అభిప్రాయపడ్డారు. ఈ ఇద్దరు మహాయాన దార్శనికుల్ని బ్రాహ్మణ మతస్థులు హత్య చేసారని డా॥ బి.ఎస్.ఎల్. గట్టిగా విశ్వసించారు. ఆయన రాసిన ''ఆంధ్రుల చరిత్ర''లో నాగార్జున, ఆర్యదేవుల హత్యోదంతాన్ని వెల్లడించారు. ''కథా సరిత్సాగర'' గాథ విశ్వసనీయమే అయితే నాగార్జునుడొక కుట్రకు బలియైనాడు. అతని ప్రచారంతో బౌద్ధం కొత్త శక్తిని సంతరించుకొని విజృంభించడాన్ని సహించలేని బ్రాహ్మణ మతస్థులు అతని హత్యకు కారణమై యుండవచ్చు. అతని తర్వాత ఆచార్య పీఠాన్ని అలంకరించిన ఆర్యదేవుడు సయితం ఆంధ్రుడేకాని ఇతడు కూడ బ్రాహ్మణుల చేతుల్లో మరణించినాడు''.[12] ఇక్కడొక వాస్తవాన్ని మనం గుర్తించాలి. బౌద్ధం ఎన్ని శాఖలుగా చీలినా, ఎన్ని రూపాలు ధరించినా వర్ణవ్యవస్థను ఎట్టి పరిస్థితిలోను అంగీకరించలేదు. అందువల్లనే దార్శనికంగా

నాగార్జునుడి శూన్యవాదం శంకరుని మాయావాదానికి మార్గదర్శి అయినా, సామాజికంగా బౌద్ధుల విప్లవాత్మక భావాల్ని బ్రాహ్మణమత ప్రతినిధియైన శంకరుడు అంగీకరించలేదు సామాజిక సమానత్వాన్ని చివరి వరకు ప్రచారం చేసిన బౌద్ధంలోని ఏ శాఖ అయినా బ్రాహ్మణ మతస్థులకు ద్వేషం అనడంలో సందేహంలేదు. ఆకారణం వల్లనే శంకరుడు తాత్వికంగా మాధ్యమిక వాదానికి (నాగార్జునుడికి) ఎంత సన్నిహితంగా వచ్చినా, ఆవాస్తవాన్ని తనరచనల్లో ఎక్కడా వ్యక్తీకరించకపోగా, వారిపై పసలేని వాదనల్ని ''బ్రహ్మ సూత్ర భాష్యం'' లో చేశాడు.

ఆంధ్రలో బౌద్ధం కేవలం ప్రజా ఉద్యమంగా ఆంధ్రుల సాంస్కృతిక రాజకీయ చరిత్రను ప్రభావితం చేయడమే కాక, బౌద్ధాన్ని దర్శనంగా అభివృద్ధిచేసిన దార్శనికుల్ని తయారు చేసింది. ఈ బౌద్ధాచార్యులు ధార్మిక, దార్శనిక అధ్యయనంలోనేకాక లౌకిక విద్యలయిన తర్కశాస్త్రం, రాజకీయ శాస్త్రం, వ్యాకరణం వంటి వాటిలోకూడా ఆసక్తి కనబరచారని, నాగార్జునుని 'తర్కశాస్త్ర పితామహుడనవచ్చునని' ఆంధ్రుల చరిత్ర గ్రంథంలో అభిప్రాయపడ్డారు డా॥ బి.ఎస్.ఎల్. హనుమంతరావు. నాగార్జునుడు ''రత్నావళి'' లో దేశపరిపాలనకు సంబంధించిన అనేక విషయాల్ని చర్చించాడు. అంతేకాదు, దానిలో నాగార్జునుడు శ్రేయోరాజ్య సిద్ధాంతాన్ని ఊహించాడని ఆయన అభిప్రాయపడ్డారు. (Nagarjuna conceives a state just on the lines of Welfare State).[13] నిజానికి నాగార్జునుడి ''సుహృల్లేఖ'' ''రత్నావళి'' గ్రంథాలను , కౌటిల్యుడి ''అర్థశాస్త్రం'' మనువు 'ధర్మశాస్త్ర' గ్రంధాల్ని తులనాత్మకంగా అధ్యయనం చేస్తే నాగార్జునుడెంత ఉదార మానవతా వాదో, శ్రేయోరాజ్యవాదో, కౌటిల్యుడు, మనువులాంటి వారు ఎంతటి ప్రగతి నిరోధకులో, ప్రజా వ్యతిరేక ధోరణి గలవారో స్పష్టమవుతుంది.

బౌద్ధం ఎందుకు క్షీణించిందో చర్చిస్తూ, ప్రధాన కారణంగా బ్రాహ్మణ మతోద్ధరణను పేర్కొన్నారు. దేశంలో సంభవించిన ఆర్థిక పరిణామాలు కూడా చాలావరకు కారణంగా పేర్కొనవచ్చునంటారు. బౌద్ధాన్ని ఆదరించిన వైశ్యులు, చేతి పనులవారు ఆర్థిక పరిణామాలవల్ల బాగా చితికిపోయారు. ఆర్థికంగా అండగా ఉన్న వర్గాలు బలహీన పడటంతో బౌద్ధానికి ఆదరణ తగ్గింది. దానితోపాటు బౌద్ధంలో ఆంతరంగికంగా సంభవించిన మార్పులు కూడ బౌద్ధం క్షీణించడానికి, హిందూమతానికి పైచేయి కావడానికి దోహదం చేశాయి. ఇక్ష్వాకుల తర్వాత శ్రీ పర్వత ప్రాంతంలో రాజ్యపాలన చేసిన పల్లవులు బౌద్ధానికి బద్ధశత్రువులుగా పరిణమించారు. త్రిలోచన పల్లవుడు బౌద్ధ, జైన మతాల విధ్వంసకుడిగా వైదికమత పరిరక్షకుడిగా చరిత్రకారులు భావిస్తున్నారు. త్రిలోచన పల్లవుడు ధాన్యకటకాన్ని (అమరావతి) రాజధానిగా చేసుకొని ఉత్తర భారతంలోని అనేక బ్రాహ్మణ కుటుంబాలను తన రాజ్యంలో స్థిరపడవలసిందిగా కోరాడు. పల్లవ రాజుల్లో త్రిలోచనడు, సింహవర్మ నాగర్జునకొండ, ధాన్యకటకాల్లో బౌద్ధానికి చాలా నష్టం కలిగించారు. అదే సమయంలో హిందూమతంలో అనేక మార్పులు జరిగాయి: ఆస్తిక ధోరణి ప్రబలింది; దేవాలయం హిందూ మతానికి కేంద్రమయింది. బ్రాహ్మణ మతానికి బౌద్ధం ప్రధాన సమస్యగా పరిణమించిన ఈ దశలో హిందూమత పరంగా కొన్ని పరిణామాలు అనివార్యమయినాయి. ఈ పరిణామాల్ని ''ప్రాచీన భారత మత సంప్రదాయం''[14] అనే వ్యాసంలో ప్రతిభావంతంగా చర్చించారు బి. ఎస్. ఎల్. అబ్రాహ్మణ మతయిన భాగవత మతంతో రాజీపడి, బౌద్ధాన్ని ప్రతిఘటించడానికి బ్రాహ్మణమత

సంస్కరణోద్యమం ప్రారంభించారు. దానిలో భాగంగా అబ్రాహ్మణుడైన వాసుదేవుడు రచించిన ''గీత''ను బ్రాహ్మణ సంస్కర్తలు స్వీకరించారని చెబుతూ, ఒక ఆసక్తికరమయిన విషయాన్ని మన దృష్టికి తెచ్చారు. ''వాసుదేవుడు రచించిన 'గీత' మొదట్లో చాలా చిన్న గ్రంథం. అది అవైదికము - అబ్రాహ్మణము, దాన్ని ఆర్య పూజారి వర్గం నిషేధించినట్లు సయితం తెలుస్తుంది''[15] నేడు ''భాగవద్గీత''ను పరమపవిత్రంగా భావించేవారికి ఈ మాటలు ఆశ్చర్యకరంగా కనిపించవచ్చు. కాని

"I was particularly impressed by the article (reproduction of a lecture, rather) on the origin of the caste system in India by the late Dr. BSL Hanumantha Rao, Caste - System is one of the most intriguing but durable features of Indian Policy. Almost everybody denounces it on the public platform, but few or none seem to have the guts to break away from its bonds in private life. As for its origin , there are as many theories as there are scholars or psendo-scholars. Dr. Hanumantha Rao had done some original research and broken new ground in this confusing jungle of myths and legends, miscalled theories. It was a pleasant surprise to read of the presence of the priestly class in the Harappan civilisation, which had come into the Aryan society; also that the 'sudras' were not 'Dasyus' or 'Dravidians' (a valuable addition to Dr. B. R. Ambedkar's booklet, "Who are the Sudras"?)

- Dr. D. Anjaneyulu, Madras
**"Misimi"** Marching Ahead'

మిసిమి పై పాఠకుల అభిప్రాయాలు. పేజి నెం. 325
మిసిమి ప్రత్యేక సంచిక ఆగష్టు, 1994

పూజారి వర్గం చరిత్ర తెలిసినవారికి ఇది ఆశ్చర్యపడాల్సిన విషయం కాదు. చరిత్రలో తమకు వ్యతిరేకమైన వాటినికూడా అనుకూలంగా మార్చుకొని మనుగడ సాగించింది కాబట్టే పూజారివర్గం నేటికి కూడా తమ అధిపత్యాన్ని ఏదో రూపంలో కొనసాగిస్తూనే ఉంది. ఈ సమయంలోనే వివిధ శాఖల మధ్య విభేదాలు, వైషమ్యాలు పెరిగి బౌద్ధసంఘం బలహీన పడింది. తాంత్రిక, వజ్రయాన పద్ధతులు ప్రబలడంతో ప్రజల దృష్టిలో బౌద్ధానికి విలువ తగ్గింది. నైతికంగా నీరసించి ప్రజాదరణ కోల్పోయింది. బ్రాహ్మణ మతస్థులు, జైనులు బౌద్ధులపై సిద్ధాంతపరమైన దాడి కూడ ప్రారంభించారు. కుమారి లభట్టు, ''శ్లోకవార్తికం''లో, శంకరుడు ''బ్రహ్మసూత్ర భాష్యం''లో బుద్ధుడిపై దాడిచేశారు. ఆయన్ని ప్రజా వ్యతిరేకిగా చిత్రించారు. అగ్ని, విష్ణు పురాణాలుకూడా బుద్ధుణ్ణి నీచంగా చిత్రించాయి.

మధ్యయుగంలోని ధర్మశాస్త్రాలు, ముఖ్యంగా ''స్మృత్యర్థసారం'' బౌద్ధుల్ని అస్పృశ్యుల్లో చేర్చింది. ''యాజ్ఞవల్క్యస్మృతి'' బౌద్ధుల్ని కలలో చూడటంకూడా అనర్థదాయకమని, అపవిత్రమని పేర్కొంది. ఇలా బౌద్ధంపై అనేక పద్ధతుల్లో దాడులు జరిగాయి అని, చివరగా మల్లికార్జున పండితారాధ్యుడి వీరశైవ ఉద్యమంవల్ల బౌద్ధం పూర్తిగా అంతరించిందని డా॥ బి. ఎస్. ఎల్. వెల్లడించారు. బహిరంగ వాదనల్లో బౌద్ధుల్ని ఏదోవిధంగా ఓడించి, వారిని శారీరకంగా హతమార్చడం మల్లికార్జున పండితారాధ్యుడి కాలంలో జరిగింది. దీనితో బౌద్ధం మరల కోలుకోలేకపోయింది. ఈ విధంగా ఆంధ్రలో బౌద్ధం ఆవిర్భవించి, గొప్ప ప్రజా ఉద్యమంగా కొనసాగి, కొన్ని శతాబ్దాల తర్వాత దేశంలో సంభవించిన ఆర్థిక, రాజకీయ పరిణామాలు, బౌద్ధంలో ఆంతరంగిక మార్పులు, వైదిక మతాచార్యుల దాడులవల్ల పూర్తిగా క్షీణించిపోయింది. కనీసం చారిత్రక శిధిలాలుగానయినా మిగిలిపోవాల్సిన బౌద్ధ స్తూపాలు, ఆరామాలు శైవాలయాలుగా రూపొందాయి. పంచారామాలుగా ప్రసిద్ధి చెందిన శైవాలయాలు బౌద్ధ స్థూపాలపైన నిర్మించబడ్డాయనే అభిప్రాయం చరిత్రకారులలో చాలా బలీయంగా ఉంది. ఈ విధంగా ఆంధ్రదేశ మత పరిణామాలలో అంతర్భాగంగా బౌద్ధ ధర్మాన్ని తమ ''రెలిజియన్ ఇన్ ఆంధ్ర'' లో డా॥ బి.ఎస్.ఎల్. చిత్రించారు.

''ఆంధ్రుల చరిత్ర'' తొలి ముద్రణలు 1956లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన సందర్భంలో ఆచార్య మామిడిపూడి వెంకట రంగయ్య, ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులు గార్ల ప్రోత్సాహంతో బి. ఎస్. ఎల్. హనుమంతరావు వెలువరించారు. 1956లో రచించిన ఈ గ్రంథాన్ని తర్వాతి కాలంలో వెలువడిన నూతన పరిశోధనా ఫలితాల వెలుగులో పాత భావాల్ని సమీక్షచేసుకొని 1983లో కొత్త గ్రంథంగా వెలువరించారు. తిరిగి 1993లో మరోసారి సమీక్షించారు; ఆ గ్రంథం 1994లో కొత్త రూపాన్ని సంతరించుకొంది. ఆంధ్రుల చరిత్ర, జనాదరణతో అనేక ముద్రణలను పొందింది. శాతవాహన యుగంనుండి కుతుబ్‌షాహీ యుగం వరకు జరిగిన రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక పరిణామాల్ని ఇందులో ఆయన ప్రతిభావంతంగా చర్చించారు. చరిత్ర రచనలో సంకుచిత భావాలకు ప్రాముఖ్యమివ్వకుండ, సత్యాన్వేషణ దృష్టితో, విమర్శనాత్మక దృష్టితో ఆంధ్రుల చరిత్రను పరిశీలించారు అని చెప్పడానికి చక్కని ఉదాహరణ ''కాకతీయ యుగం - మత సాంఘిక పరిస్థితులు'''' శీర్షికలో చర్చించిన విషయాలు. నేడు హిందూ మతోన్మాదులు, ముస్లింలు హిందూ దేవాలయాల్ని విధ్వంసం చేయడానికి ప్రధాన కారణంగా హిందూమత వ్యతిరేకత, ద్వేషమే కారణమని చిత్రిస్తూ, పరస్పరం అపోహలు ఏర్పడేటట్టు చరిత్రను చిత్రిస్తున్నారు. ఇది చాలా ప్రమాదకరమైన ధోరణి. ఈ ధోరణి ఎంత పొరపాటో కాకతీయ యుగంలోని దేవాలయాల గురించి డా॥ బి.ఎస్.ఎల్. అన్నమాటలు చదివితే తెలుస్తుంది. ''ఆలయాలు బ్యాంకులుగా, నాటకశాలలుగా, ప్రదర్శన శాలలుగా, వర్తక శ్రేణులకు కార్య స్థానాలుగా ఉపకరించేవి. ఇన్ని విధాల ఐశ్వర్యవంతమైన ఆలయం చుట్టూ సామాజిక కార్యక్రమాలు అల్లుకొని వున్నందునే ముస్లింలు ఆలయాలపై దృష్టి కేంద్రీకరించారు. ఆలయాల విధ్వంసంతో సామాజిక జీవితం విచ్ఛిన్నమై దేశాక్రమణ సులభం కాగలదని వారి ఉద్దేశ్యమయి వుంటుంది''.[16] అంటే ముస్లిములు కేవలం మత వ్యతిరేకతతో హిందూ దేవాలయాల్ని పడగొట్టలేదని, ఆ విధ్వంసంవెనుక సామాజిక, ఆర్థిక, రాజకీయ కారణాలు ప్రధానపాత్ర వహిస్తున్నాయని గ్రహించగలం. క్రీ.శ.12వ శతాబ్దం నుండి ''శూద్ర'' కులాలు (రెడ్డి-వెలమ-కమ్మ-కాపు) ఆంధ్రదేశ రాజకీయ, సామాజిక జీవితాన్ని ప్రభావితం చేస్తున్నాయి. కాకతీయుల కాలంలో ఈ వ్యవసాయ కులాలమధ్య

జరిగిన ఘర్షణలు ఆ రాజ్య పతనానికి దారితీశాయి. ఈ కులాలమధ్య వైషమ్యాలు ఆరాజ్య విచ్ఛిత్తికి ఎలా దోహదపడ్డాయో ఇలా వివరించారు. ''రాజకీయంగా ప్రాముఖ్యం వహించిన రెడ్డి, వెలమ కులాలమధ్య అధికారానికై పోటీ ప్రారంభమయింది ఈ వర్గాలు కాకతీయుల పతనానంతరం కూడా పరస్పరం యుద్ధాల్లో మునిగి బహమనీ రాజ్య విస్తరణకు అవకాశం కల్పించడం శోచనీయం'' అని ఆయన వ్యాఖ్యానించడం ద్వారా కులతత్వం యుగయుగాలుగా దేశ సమైక్యతకు ఎంత ఆటంకంగా, లక్ష్యంకిగా తయారయిందో నిరూపించగలిగారు. ఆంధ్రదేశ చరిత్రలో ఇది ప్రత్యేకంగా అధ్యయనం చేయాల్సిన యుగం. ఈ యుగంలో కులం ఎటువంటి పాత్ర నిర్వహించిందో, అదే విధమైన పాత్ర నేడు ఆంధ్రదేశంలోను, జాతీయ జీవన స్రవంతిలోను నిర్వహిస్తోంది. ఇప్పటికయినా ప్రగతిని కాంక్షించేవారు, దేశ సమైక్యతను ఆశించేవారు కళ్ళు తెరచి గతచరిత్రనుండి గుణపాఠాలు నేర్చుకోకపోతే మరోసారి దేశానికి అనర్థం తప్పదేమో!

డా॥ బి. ఎస్ ఎల్ చరిత్ర తత్వం తెలిసిన చరిత్రకారుడు. ఆయనపై మానవవాద తత్వవేత్త ఎం.ఎన్ రాయ్ ప్రభావం ఉంది.[17] ఎం.ఎన్. రాయ్ చరిత్ర తాత్వికత (Philosophy of History) గురించి చెబుతూ చరిత్రను ఇలా నిర్వచించారు· 'తత్వశాస్త్రాన్ని ఉదాహరణలతో బోధించటమే చరిత్ర' (History is Philosophy teaching by examples). ఈ దృక్పథంతో ఆయన ఆంధ్రదేశ చరిత్రను విశిష్ట కోణంలో విశ్లేషించి 'నరుడు నరుడౌట ఎంత దుష్కరము సుమ్మి' అన్న మహాకవి గాలీబు మాటలు ఎంత వాస్తవమో నిరూపించారు. వానరుడు, నరుడిగా పరిణామం చెందడానికి ఎన్నివందల సంవత్సరాలు పట్టిందో చెప్పవచ్చునేమోకాని నరుడు నరుడిగా ఎప్పుడు పూర్తిగా పరిణామంచెందుతాడో చెప్పడం అంత తేలికయిన విషయం కాదని చరిత్రను అధ్యయనం చేసిన వారందరికీ తెలిసిన విషయం. తెగల దశలో ఉన్న ఆంధ్రులు జైన, బౌద్ధాల ప్రభావంతో నాగరిక జాతిగా ఆవిర్భవించారు. మరల ఆ ఆంధ్రులే బ్రాహ్మణమత ప్రభావంతో వర్ణవ్యవస్థ విషయవలయంలో చిక్కుకొని ఆటవికతను మరోరూపంలో పునరుద్ధరించారు. సంక్లిష్టమైన ఈ పరిణామానికి దారితీసిన ఆర్థిక, సామాజిక, మతపరమయి కారణాల్ని వివరించటంలో బి. ఎస్. ఎల్. హనుమంతరావు ఆర్థికవాద వ్యాఖ్యానంలోని పరిమితుల్ని గుర్తించారు. చరిత్రను ప్రభావితం చేసిన కారణాల్లో ఆర్థికాంశంతోపాటు ఇంకా అనేక కారణాల ప్రాధాన్యతను ఆయన వెలికితీశారు. ఆంధ్రదేశ చరిత్ర రచనలో ఆయన ప్రవేశ పెట్టిన సమాకలన(integral) దృక్పథం విశిష్టత ఇది సమాకలన దృక్పథానికి తార్కాణమే రెవిజియన్ ఇన్ ఆంధ్ర గ్రంథం. ఆయనపై ఎం. ఎన్. రాయ్ ప్రభావం ఎంతవుందో, అంతకంటే ఎక్కువగా మార్క్సిస్టు తాత్వికుల ప్రభావం ఉందని చెప్పవచ్చు.[18] అందువల్లనే ఆంధ్రదేశంలోని రాయిస్టులకంటే మార్క్సిస్టులకు, మార్క్సిస్టు చారిత్రక దృక్పథం ప్రభావం కలవారికి ఆయన అభిమాన పాత్రుడయ్యారు. బి.ఎస్.ఎల్. హనుమంతరావు ఒక సందర్భంలో అంటారు ''చటోపాధ్యాయ (మార్క్సిస్టు) గ్రంథాల్లో నాకు ఆసక్తి ఉండటం సహజమే. అయితే చటోపాధ్యాయ భావాలన్నింటితో ఏకీభవించాల్సిన పనిలేదు''. ఆంధ్రదేశంలోని రాయిస్టు లెవరూ మార్క్సిస్టు మేధావుల గురించి ఇంత సానుకూల దృక్పథంతో రాయలేదు; వారి రచనల్ని అభిమానించలేదు.

చరిత్రలో మానవ వికాసానికి అనేక అడ్డంకులున్నాయి. ఆ అడ్డంకులన్నిటిని అధిగమించి నరుడు నిజమైన మానవుడిగా ఆవిర్భవించడానికి ఇంకెంత కాలం పడుతుందో చెప్పలేము. నరుడు నరుడౌటానికి నిజమైన అడ్డంకులు కుల, మత వ్యవస్థలు. ఈ రెండు వ్యవస్థలు ఆంధ్రదేశ చరిత్రలో వివిధ యుగాల్లో

ఎటువంటి పాత్ర నిర్వహించింది డా॥ బి. ఎస్. ఎల్. హనుమంతరావు సాధికారికంగా ఉదాహరణలతో నిరూపించారు. ఆయనంటారు ' నిన్ననేటికి మూలం. రేపు దాని ఫలితం' (......that yesterday is the root of today and tomorrow is its fruit). అంటే గతం ( నిన్న) వర్తమానం (నేడు) భవిష్యత్తు (రేపు) పరస్పరాశ్రితాలు. నిన్న నేటికి మూలంగా గుర్తించిన ఏ చరిత్రకారుడయినా గత చరిత్రను విశ్లేషించేటప్పుడు బాధ్యతాయుతమైన పాత్ర నిర్వహిస్తారని చెప్పడానికి డా॥ బి.ఎస్.ఎల్. హనుమంతరావు రచించిన గ్రంథాలేతార్కాణం. ఏ మతమయినా, కులమయినా మానవజాతి చరిత్రలో భాగమేనని భావించిన చరిత్ర కారుడు రాగద్వేషాలకు అతీతంగా శాస్త్రీయ చారిత్రక దృక్పథంతో ఆయా మతాల్ని, కులాల్ని అవి చరిత్రలో నిర్వహించిన పాత్రను చిత్రిస్తాడని, పరస్పరం సంఘర్షించుకున్న ఈ మతాల, కులాల అసలు రూపాల్ని వెలికితీస్తూ, అవి ఏయేకాలాల్లో, ఏయే రూపంలో ఎటువంటి పాత్రను నిర్వహించాయో వెలుగులోకి తెస్తాడని బి ఎస్ ఎల్. హనుమంతరావు ఆంధ్రాంగ్ల రచనల్ని పరిశీలిస్తే విశదమౌతుంది.

బి. ఎస్. ఎల్. ముందు తరంవారు కాని ఆయన సమకాలికులుకాని మత పరిణామాలు, కుల వ్యవస్థ ప్రభావం అనే రెండు విషయాల్లో ఏదో ఒక విషయాన్ని తీసుకొని పరిశోధనో, గ్రంథరచనో చేశారు. కాని ఆయనలా ఈ రెండు విషయాలు ఆంధ్రదేశ చరిత్రలో పరస్పర సంబంధం వున్న విషయాలుగా పరిగణించి ఆంధ్రదేశ చరిత్రను అధ్యయనం చేయలేదు. చరిత్ర కారుడిగా ఆయన సమాజం యెడల గల బాధ్యతను గుర్తించారు. గత చరిత్ర విద్యార్థిగా, ఆ జ్ఞానపు వెలుగులో సమకాలిక సమాజంలో వివిధ వర్గాల ప్రజలమధ్యగల కొన్ని దురభిప్రాయాల్ని, అపోహల్ని పారద్రోలి, సమన్వయ పూర్వకమైన మానవ సంబంధాలు ఏర్పడటానికి కావాల్సిన సైద్ధాంతిక పునాదుల్ని వేయవలసిన బాధ్యతను గుర్తెరిగినవారు డా॥ బి. ఎస్. ఎల్. హనుమంతరావు. మానవ నిర్మితాలయిన ఏ వ్యవస్థలయినా మానవ సమాజాభివృద్ధికి ఆటంకం, అడ్డంకి అయినప్పుడు బాధ్యత గల చరిత్రకారుడు మౌనంగా ప్రేక్షక పాత్ర పోషించడు. వృత్తిరీత్యా, ప్రవృత్తిరీత్యా తాను నిర్వర్తించాల్సిన సామాజిక బాధ్యతను నిర్వర్తించి తీరుతాడనడానికి తార్కాణమే బి.ఎస్.ఎల్. హనుమంతరావు అవైదిక మతాలు, కులవ్యవస్థపై చేసిన రచనలు.

***పథోజ్ఞాపికలు :***


1. పేజీ నెం. 451 ఆంధ్రుల చరిత్ర - విస్తృత ద్వితీయముద్రణ విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్. 1998.
2. Page Nos 140 - 164 Socio Cultural History of Ancient and Medieval Andhra, Telugu University 1995.
3. పేజీనెం. 44-49 భారతీయ సంస్కృతి - ఒకపరిశీలన, ద్వితీయ ముద్రణ, జూన్1994.
4. Buddhist Inscriptions of Andhra Desa - Ananda Buddha Vihara Trust, Secunderabad 1998.
5. "Andhra Brahmin Through Ages" Page Nos 1-74 Social Mobility in Medieval Andhra, Telugu University 1995.

6. "The Boyas in Medieval Andhra History" Page Nos. 75-78 Social Mobility in Medieval Andhra.
7. Reference No. 18 Page No. 26 Religion in Andhra, II Edition, Director, Dept of Archacology and Museums, Govt. of A.P. 1993.
8. Page No. 53. Religion in Andhra, II Edition.
9. Page No. 108 Religion in Andhra, II Edition. పేజీ నెం. 22-26 బౌద్ధము - ఆంధ్రము, తెలుగు విశ్వవిద్యాలయం. 1995.
10. పేజీ నెం. 48 భారతీయ సంస్కృతి - ఒక పరిశీలన. ద్వితీయముద్రణ
11. Page No. 116 Reference No.88 Religion in Andhra, II Edition
12. పేజీ నెం. 80 ఆంధ్రుల చరిత్ర. విస్తృత ద్వితీయముద్రణ 1998.
13. Page No. 113. Religion in Andhra, II Edition
14. పేజీ నెం. 11-16 భారతీయ సంస్కృతి - ఒక పరిశీలన. ద్వితీయముద్రణ
15. పేజీ నెం. 16 భారతీయ సంస్కృతి - ఒక పరిశీలన, ద్వితీయ ముద్రణ
16. పేజీ నెం. 261 ఆంధ్రుల చరిత్ర, విస్తృత ద్వితీయముద్రణ 1998
17. యమ్. యన్. రాయ్ రచనలు. 1. Memoirs of M.N. Roy 2. From Savagery to Civilization లను బి. యస్. యల్ 1. యమ్. యన్. రాయ్ స్వీయగాథలు 2. మానవ నాగరికత పేర అనువదించారు.
18. డా. బి.యస్.యల్ "In Defence of Materialism in Ancient India' అనే దేవీప్రసాద్ చటోపాధ్యాయ గ్రంథాన్ని 'లోకాయతవాద పరిశీలన' పేర అనువదించారు. "Past and Prejudice", Asoka and the Decline of the Mauryas" అనే డా॥ రొమిల్లా థాపర్ గ్రంథాలను 'గతాన్ని గూర్చిన అపోహలు', 'అశోకుడు - మౌర్య వంశక్షీణత' పేర అనువదించారు.

***సంప్రదించిన యితర రచనలు :***

1. "Andhra Contribution to Buddhist thought" Prof. K. Satchidananda Murthy. International Telugu Institute, Hyderabad 1980.
2. విశిష్ట విశ్లేషణ ( ఆచార్య బి. ఎస్. ఎల్. హనుమంతరావు పరిశోధనా ప్రత్యేకత) ఏటుకూరు బలరామమూర్తి. త్రిపురసుందరి, గుంటూరు. 1996.
3. సురవరం ప్రతాపరెడ్డి వ్యాసాలు - రెండవ భాగం - సురవరం ప్రతాపరెడ్డి సాహిత్య వైజయంతి, హైదరాబాదు, 1988.
4. లోకాయత వాద పరిశీలన దేవీప్రసాద్ చటోపాధ్యాయ అనువాదం. బి. ఎస్. ఎల్. హనుమంతరావు, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, 1989.

# కవి - శాస్త్రవేత్త

(1960 నోబెల్ సాహిత్య పురస్కార స్వీకారోపన్యాసం)

మూలం : సేంట్ - జాన్ పెర్స్ అనువాదం : యస్. ఎ. మహమ్మద్

కవిత్వానికి ఇక్కడ బహూకరించిన గౌరవాన్ని కవిత్వం తరపున స్వీకరించి దాన్ని కవిత్వానికే పునరంకితం చేయాలని ఆదుర్దాతో ఉన్నాను. భౌతిక సౌఖ్యాలకు బానిస అయిన సమాజానికి, కవిత్వ కార్యకలాపానికి మధ్య రాను రాను దూరం పెరిగిపోతున్న ఈ తరుణాన మీ వినా కవిత్వాన్ని తరచూ గౌరవించే దెవరు? తాను వాంఛించనిదైనా ఈ విచ్ఛిత్తిని కవి స్వీకరిస్తాడు శాస్త్ర ఆవిష్కారాలకున్న ప్రాయోగిక ప్రయోజనాలను మినహాయిస్తే ఇది శాస్త్రజ్ఞుడికి కూడ వర్తిస్తుంది. కాని ఇక్కడ లభిస్తున్న గౌరవం కవి, శాస్త్రజ్ఞుడు - వీరిద్దరి అనాసక్త ఊహకే. కనీసం ఈ వేదిక నుండైనా వీరిని ప్రతిరోధులైన సహోదరులుగా భావించవద్దు. తారతమ్యం ఉన్నది వారి పరిశోధనా పద్ధతుల్లోనే. నిజానికి వారు వెదకుతున్న అగాధ మొక్కటే!

హేతుజ్ఞానపు అంచులను తాకుతూ శుద్ధ గణితంలో ఆధునిక శాస్త్రం చేస్తున్న ప్రదర్శనను తిలకించినపుడు, భౌతికశాస్త్రంలో, సాధారణ సాపేక్ష సిద్ధాంతము, భౌతిక కొలతల ఖచ్చితత్వానికున్న శాశ్వత పరిమితులను చూపిస్తున్న క్వాంటం అనిశ్చిత సిద్ధాంతం వంటి సిద్ధాంతాల ప్రతిపాదన చూసినపుడు; మహా విశాల బౌద్ధిక సంయోజనను ఒక సమీకరణం స్థాయికి కుదించి వేసే ఆధునిక విశ్వశాస్త్రానికి ఆద్యుడు. ఈశతాబ్దపు గొప్ప శాస్త్ర పరిశోధకుడు, బౌద్ధిక వివేచనకు సహకరించ వలసిందని అంతర్బుద్ధిని ప్రార్థించి, ''కల్పనే శాస్త్రజ్ఞానానికి బీజక్షేత్రం'' అని ప్రకటించి, శాస్త్రవేత్త 'దార్శనికుడు' అనేంత వరకు వెళ్ళడం చూస్తే, కవితా సాధనం తర్క జ్ఞానమంతటి ధర్మబద్ధమైనదే అని భావించడంలో అన్యాయమేముంది?

నిజానికి ఏ బౌద్ధిక సృజన అయినా అసలైన అర్థంలో ముందుగా ''కవితాత్మక''మైనదే. గ్రహణ సామర్థ్యానికి, మేధకు, వాటి విధానాల్లో తుల్యత ఉన్నంతవరకు కవి - శాస్త్రజ్ఞుడు - వీరిరువురి వ్యాపారాల్లోను ప్రాధమికంగా వినియోగింప బడుతున్న ప్రమేయమొక్కటే. సంవాదాత్మక ఊహ, కవితాత్మక అధ్యాహారం - ఈ రెంటిలో ఏది సుదూర సీమలకు పయనించి మరలి వస్తుంది? ఈ ఆదిమ నిశీధంలో - శాస్త్ర సాధనాల సహాయంతో ఒకరు, తన ఊహాశక్తి మెరుపుల వెలుగు ఆసరాతో ఇంకొకరు - దారి వెదుక్కుంటున్న ఇద్దరు జన్మాంధుల్లో ఎవరు ముందుగా స్వల్ప వెలుగు దారంట మరలివస్తారు? సమాధానంతో నిమిత్తంలేదు. రహస్యం ఇద్దరికీ సమానమే. కవితాత్మక మేధస్సు ప్రదర్శించే సాహసం ఆధునికశాస్త్రం సాధిస్తున్న ప్రగతికి ఏ మాత్రం తీసిపోదు. విశ్వ వ్యాకోచ సిద్ధాంతం ఖగోళశాస్త్రజ్ఞులను కలవరపరిచింది. అయితే మనిషి నైతికి అనంత విశ్వ వ్యాకోచానికి అంతెక్కడ? శాస్త్ర అవధులు వ్యాపించినంతమేర దాని సరిహద్దుల చాపంపై కవి జాగిలాలు వేటాడ్డం వినిపిస్తుంది. ఎవరో అన్నట్లు కవిత్వం ''పరమసత్యం'' కానప్పటికి దానికి అతి సమీపానికి వస్తుంది. ఎందుకంటే కవిత్వానికి సత్యం కొరకు తహతహ, దాని ప్రగాఢ అవగాహన ఉన్నాయి. పోలికలు, ప్రతీకల ద్వారా,

మూరు మూలాల కాంతి ప్రసరించి సయోధ్య కుదిర్చే ప్రతిరూపాల ద్వారా - వీటి మధ్య సహ్రస్రరీతుల స్పందన, ప్రతిస్పందన - సంబంధ, అనుబంధాల ద్వారా, అన్నిటికంటే మించి అసలు అస్తిత్వాలయ అనువదింప బడిన భాషయొక్క సౌందర్యం ద్వారా, శాస్త్ర వేత్తకు అందని ఒక అధివాస్తవికతను కవి పెట్టుబడిగా పెడతాడు. ఇంతకంటే సంపూర్ణంగా మనిషిని ఆకర్షించి నిమగ్నంచేసే తర్క రీతి మరేమయినా ఉన్నదా! అధి భౌతిక శాస్త్ర ద్వారాన్ని తత్వవేత్తలు కూడ విడిచి పుచ్చుతున్న ఈతరుణంలో ఆ శాస్త్రాన్ని పునః ప్రతిష్ఠించవలసిన బాధ్యత కవిపై ఉన్నది. కవిత్వ ప్రయోజనాన్ని సందేహించిన ప్రాచీన తత్వవేత్త మాటల్లో చెప్పాలన్నా కూడా తత్వంకంటే కవిత్వమే నిజమైన ''విస్మయ పుత్రిక''గా దర్శనమిస్తుంది.

కవిత్వం కేవలం ఒక 'దర్శనం' కాదు. అది ఒక జీవి విధానం గుహల్లో నివశించిన ఆదిమ మానవుల్లో కవి ఉన్నాడు. అణుయుగంలో కూడ అతను బ్రతికే ఉంటాడు. ఎందుకంటే మనిషిలో అతడు అంతర్భాగం - కవిత్వానికున్న ఆధ్యాత్మికావసరంలోనే మతాలు కూడ ఉద్భవించాయి. కవిత్వ సౌందర్యం ద్వారానే దివ్యతేజస్సు మానవ చెకుముకిలో శాశ్వతంగా నిలిచి ఉంటుంది. పురాణాలు అంతర్ధానమైనపుడు దివ్యతేజస్సు కవిత్వంలోనే ఆశ్రయం పొంది చిరకాలం వర్ధిల్లుతుంది. ప్రాచీన కాలపు ఊరేగింపుల్లో ఆహారాన్ని మోసేవారు దివిటీధారులకు ముందుకు రానిచ్చినట్లు నేడు వివిధ సాంఘిక క్రమాల్లో, తత్కాల మానవాసరాల్లో, కవితాకల్పనే వెలుగు అన్వేషణలో ఉన్న మానవుల మహోన్నత ఉద్వేగాలపై కాంతిని ప్రసరిస్తుంది. తన శాశ్వత కార్య భారం కింద శిరస్సు పైకెత్తి నడుస్తున్న మనిషిని చూడండి. నిజమైన విశ్వజనీనతతో, ఆత్మ సంపూర్ణతతో ఒక నవ్య మానవతా వాదం తన ముందు ప్రత్యక్షమైనపుడు, తన మానవతా భారం క్రింద సాగిపోతున్నది అతణ్ణే పరికించండి. మనిషి అనే నిగూఢ రహస్యాన్ని శోధించడమన్న తన విధికి విశ్వసనీయంగా ఉంటూ మనిషి సంపూర్ణ ఏకీకరణకు సంబంధించిన సాహసకార్యంలో ఆధునిక కవిత్వం నిమగ్నమయ్యింది. అది కేవలం సౌందర్య సంబంధికాదు. అది పరిమళాలను అద్దేవాని, అలంకరించేవాని పనితనం కూడ కాదు. అది కృత్రిమ ముత్యాలను పొదుగదు. బాహ్య రూపాలతో చిహ్నాలతో దానికి పనిలేదు. ఏ సంగీతోత్సవం దానికి తృప్తినివ్వదు. కవిత్వం సౌందర్యంతో జతకడుతుంది. అదొక అద్భుత సంగమం - అయితే దీన్ని తన కేవల పోషణగా, తన అంతిమ గమ్యంగా వినియోగించదు. కళను జీవితాన్నుండి ప్రేమను గ్రహింపు నుండి విడదీసేందుకు నిరాకరించే కవిత్వం - చర్య, ఉద్వేగం, శక్తి, ఎప్పుడూ పరిధుల్ని అధిగమించే నవ్య ఆవిష్కారం. ప్రేమ దాని చలిమంట, తిరుగుబాటు దానినీతి. ముందు చూపులో, సర్వత్రా దాని ఉనికి. కాదనడం కాని అంటనట్లు ఉండాలని కాని దాని అభిమతం కాదు. తనకాలపు అనుకూల పరిస్థితుల నుండి అది ఏ ప్రయోజనాన్ని ఆశించదు. ఏ సిద్ధాంతానికీ బందీ కాక, తన విధికి కట్టుబడి, జీవితానికి సమానమైన దానిగా తనను తాను గుర్తిస్తుంది - అదే దాని సమర్థింపు. ఒక్క ఆలింగనంలో అది ఒకమహా సజీవగేయంలా భూత, భవిష్యత్తులను వర్తమానంలో - మానవీయాన్ని మహామానవీయంతో, గ్రహ అంతరిక్షాన్ని విశ్వ అంతరిక్షంతో ఒడిసి పట్టుకుంటుంది. నిందకు గురి అవుతున్న దాని అస్పష్టత నిజానికి కవిత్వపు స్వీయ స్వభావం కాదు. అది కవిత్వం అన్వేషించే

మనిషి ఉనికిని చుట్టుముట్టిన ఆత్మాంధకారపు నిగూఢ రహస్యం పై వెలుగు ప్రసరించేందుకు సంబంధించింది. అస్పష్టత కవిత్వాభివ్యక్తినుండి నిషేధించబడింది. ఆ అభివ్యక్తి శాస్త్రం కోరే అభీ అంః

ఇలా [illegible]జానికి పూర్తిగా కట్టుబడి కవి మనకు అస్థిత్వపు శాశ్వతత్వంతో, ఏకత్వంతో సంబంధాన్ని కుదుర్చుతాడు. భవిష్యత్తుపై ఆశావహ దృక్పధాన్ని అతన్నుండి మనం నేర్చుకుంటాం. అతని దృష్టిలో సర్వవస్తు ప్రపంచం ఒక్క సామరస్య సూత్రానికి కట్టుబడి ఉంది. మనిషికి అలవికానిదేదీ సంభవించాడానికి వీలు లేదు. చరిత్రలో సంభవించే ఆకస్మిక ఆటుపోట్లు, ఒక పునరుక్తుల, నవీకరణల సువిశాల వలయంలో ఋతుభ్రమణం తప్ప మరేం కాదు. ఈ సన్నివేశాన్ని దివిటీలు పైకెత్తిదాటే అధోలోకపు దుష్టసంహార సర్పకేశ దేవతలు ఈ సుదీర్ఘ చారిత్రక ప్రక్రియ లోని ఒక్క పిసరంత భాగంపై మాత్రమే వెలుగును ప్రసరిస్తారు. పరిణత చెందిన నాగరికతలు ఒక్కశిశిరపు పురిటి నొప్పుల్లోనే మృతి చెందవు. అవి కేవలం పరివర్తన చెందుతాయి. స్తబ్ధత ఒక్కటే పొంచి ఉన్న ఉపద్రవం. మన అలవాట్లను బ్రద్దలు కొట్టేవాడే కవి. ఇలా తనప్రమేయం లేకుండానే కవి చరిత్రకు కట్టుబడిపోతాడు. తన కాలపు నాటక దృశ్యమేదీ అతనికి అపరిచితం కాదు. అతను మనందరికీ ఈ మహాయుగంలోని జీవితం పట్ల స్పష్టమైన అభిరుచిని కలిగించు గాక! ఎందుకంటే ఈ గొప్ప మహాయుగం ఒక నవ్య స్వీయ విశ్లేషణకు పిలుపునిస్తోంది. మనయుగానికి చెందినవాడిగా ఈ గౌరవాన్ని కవికి కాక మరెవరికివ్వగలం?

చరిత్ర ఒకనాడు తన హింసా బురఖాను తొలగించి, తన ప్రళయ నృత్యపు శిఖర దశలో అభయ హస్తాన్ని సాచే ఆసియా దేవతలా చేయిపైకెత్తి ''భయపడకండి'' అంటుంది. ''భయంవలదు, సందేహం వలదు. సందేహం అనుత్పాది, భయం బానిసత్వం. నిరంతర నిర్మాణ ప్రక్రియలోనున్న మహామానవ గాథపై నవ్య ఆవిష్కారాలను విధించే నా మహోన్నత హస్తపులయాత్మక ధ్వనిని ఆలకించండి. జీవితం తనను త్యజించగలదనడం నిజంకాదు. శూన్యంనుండి ఉద్భవించి శూన్యం కొరకు ఆరాట పడే జీవి ఏదీ లేదు. కాని అస్థిత్వపు నిరంతర ప్రవాహాన్నుండి ఏదీ దూరంగా ఉండడం జరగదు. ఉన్న విషాదం రూపాంతరం చెండంలో కాదు. యుగపు అసలు నాటకం ఐహిక మానవుడికి, చిరంజీవమానవుడుకి నడుమ పెరుగుతున్న దూరంలో ఉంది. ఒకపార్శ్వం వెలుగులో ఉన్న మానవుడు వేరొకపార్శ్వం అంధకారంలో కూరుకు పోతున్నాడా? ఉన్న సమూహంతో మమేకం చెందని అతనిపై బలవంతంగా రుద్దబడిన పరిణతి అసత్య పరిణతి కాదా? మనమధ్య మనిషి ద్వంద్వ వృత్తికి సాక్షిగా నిలవ వలసిన బాధ్యత నిజమైన కవిపై ఉంది. అంటే తన అంతరంగపు ఆధ్యాత్మిక సంభావ్యతలను సూక్ష్మంగా గ్రహించే దర్పణంలో ప్రతిబింబించడమే అంటే ఈయున శతాబ్దంలో మౌలిక మానవుడికి దీటైన మానవస్థితిని స్ఫురణకు తేవడమే. అంటే, అంతిమంగా, సామూహిక ఆత్మను ( ప్రపంచపు ఆధ్యాత్మిక శక్తికి దగ్గరగా తేవడమే. అణు శక్తి సమక్షంలో, కవి వెలిగించే మట్టి ప్రమిద అతని ప్రయోజనానికి సరిపోతుందా? అవుననే చెప్పాలి - మనిషి మట్టిని మరువకుంటే.

కాబట్టి కవి తన యుగపు దౌష్ట్యానికి అంతరాత్మ ప్రబోధం కాగలిగితే చాలు.

# భాషాకుటుంబం - జంతు ప్రపంచం

- జానమద్ది హనుమచ్ఛాస్త్రి

భాషా కుటుంబంలో కొన్ని జంతువుల పేర్లలో గల సామ్యం మనకెంతో వింతగా తోస్తుంది. మనలను పగటి వేళల కంటే రాత్రివేళల్లో ఎక్కువగా పీడించే దోమను సంస్కృతంలో 'మశక' అంటాం. ఈ పదం వేదాల్లోకెక్కింది. ఆశ్రమాల్లోని మహర్షులకు కూడా దోమల బెడద తప్పింది కాదేమో. ఆంగ్లంలో ఈ 'మశకమే' మస్క్విటో (Mosquito) గా పిలువబడుతున్నది. ఆంగ్ల భాషలో అచ్చమైన ఆంగ్లపదాలు ముప్పయి శాతం మించవని, ప్రపంచ మందలి పలుభాషా పదాలను అక్కున జేర్చుకొని ఆంగ్లభాష ఈనాడు అంతర్జాతీయ భాషగా విజృంభిస్తున్నదని భాషా శాస్త్ర వేత్తలనటంలో అబ్బురమే మాత్రం లేదు. అసలీ 'మస్క్విటో' స్పానిష్, ఫ్రెంచి భాషల నుండి 15వ శతాబ్దంలో ఆంగ్లభాషా కోశం చేరింది. అసలీ పదం అతి ప్రాచీనమైన లాటిన్ భాషలోని ముస్క (Musca) నుండి ఆవిర్భవించింది. అల్పాల్పమైన ఈదోమలు సంస్కృత, లాటిన్ భాషల్లో దాదాపు ఒకే పేరు గలిగి వుండటం వాటికి మానవులకూ గల అతి ప్రాచీన బాంధవ్యాన్ని నిరూపిస్తున్నది.

ఈ ముస్క లేదా మశక అన్న పేరుతో మస్కెట్ అనే పాశ్చాత్య ఆయుధం వెలిసింది. అదో రకమైన తుపాకి మస్కెట్ ధరించిన 'త్రీమస్కెటీర్స్'' లోక ప్రసిద్ధులయ్యారు.

హిందువులకే కాక, జైన, చీనీయులకు కూడా ఆరాధ్యుడైన గణపతి వాహనం మూషికం. అంటే ఎలుక. గ్రీక్ భాషలో మూస్ (Mys) లాటిన్‌లో కూడా ముస్ (Mus) ఆంగ్లంలో మౌస్ (Mouse) ట్యూటానిక్ మరియు ఇండో జర్మన్ భాషల్లో కూడా నామ సామ్యం కానవస్తుంది. సంస్కృత భాషలో మూష(క) శబ్దం ముష్ (దొంగిలించు) ధాతువు నుండి పుట్టిన దనటంలో వాస్తవ మెంతో వుంది. ఇంటింటా తిష్టవేసే ఎలుకల సామ్రాజ్యం అత్యంత విశాలమైనదని జీవ శాస్త్ర వేత్తలు పేర్కొన్నారు.

కొక్కులు కథ మరో విధంగా వుంది. ఇంగ్లీష్, ఫ్రెంచి, జర్మన్ భాషలన్నిటిలోనూ కొక్కు ర్యాట్ (Rat) అనే పిలువ బడుతూవుంది. క్రీ॥శ॥ 10వ శతాబ్దంలో ఉత్తర యూరోప్‌కు చెందిన ట్యూటానిక్ భాషల్లో ( ఇంగ్లీష్, జర్మన్ మొదలగు) భాషలలోకి అడుగు పెట్టి 'ర్యాట్' పలు పాశ్చాత్య భాషలలోనికి ప్రవేశించి చివరకు లాటిన్‌లో చేరిందట.

ద్రావిడ భాషల్లో ఎలుక వివిధ నామాలు ధరించింది. కన్నడ భాషలో హెగ్గణ (హళె కన్నడంలో పైగణ) తుళు భాషలో 'పెర్గుడె' అంటే బొరియలు త్రవ్వే పెద్ద ప్రాణి.

తెలుగు భాష తన పదాలను కొన్నింటిని ఆంగ్లేయులకు దత్తం చేసింది. తెలుగు నాట విస్తృతంగా కానవచ్చే 'పందికొక్కు' ఆంగ్లభాషకు బ్యాండికూట్ (Bandicoot)ను ఇచ్చింది. అది వరకు చిట్టెలుకలను మాత్రమే చూచిన తెల్లదొరలకు పందికొక్కులు ఎదురైంది మొదట భారతదేశంలోనే ఈ మహామూషికం పందిలా గురక పెడ్తుందని ప్రతీతి.

'కస్తూరీ తిలకం లలాట ఫలకే' అని అభినుతింపబడుతున్న మన దేవదేవుడు ధరించే సుగంధ ద్రవ్యం కస్తూరి. ఈ 'కస్తూరి'ని ఆంగ్లంలో మస్క్ (Musk) అంటారు. తన పొట్టలో కస్తూరిని దాచుకున్న కస్తూరీ మృగం హిమాలయి ప్రాంతాల్లో మాత్రం వుంటుంది. విదేశాలకు కూడా ఇదే పేరుతో ఎగుమతి అవుతు ండేదని మన వూహ. ఇంగ్లీష్‌లో మస్, పారసీ భాషలో ముష్క్ యూరోఫ్ దేశాలకు వెళ్ళింది. ప్రధానంగా అరబ్ వ్యాపారులే దీనిని తీసుకుని వెళ్ళేవారు. కాని ఈ 'ముష్క్' అరబిక్ పదంకాదు, సంస్కృతి మందలి 'ముష్క' పద జన్యం అనటంలో వాస్తవముంది. 'ముష్క' అంటే అండకోశం. కస్తూరి మృగం యొక్క అండమన్న భ్రమతో ఈ పేరు పెట్టి వుండవచ్చునని తర్కాచార్యుల వాదం.

భారో ప్రజల మూల నివాసం ఏదో ఇంకా వివాదంగానే వున్నా వారు మొదట నెలకొన్న చోట ఎలుగు, అడవి పంది, తోడేలు వుండిన వని చెప్పవచ్చు. ఎలుగు బంటిని సంస్కృతంలో 'భల్ల' అంటే, ఆంగ్లంలో 'బేర్', జర్మన్‌లో 'బర్', డచ్ భాషలో 'బీర్' (Bear) ఇలా పేర్లు భాషల్లో 'ర' 'ల' వినిమయం సాధారణం.

తోడేలును సంస్కృతంలో 'వృక' అయితే ఆంగ్లంలో వుల్ఫ్ (Wolf) జర్మన్ భాషలో ''వోల్ఫ్'' లాటిన్‌లో లూపస్, గ్రీక్‌లో Lykos ఇవన్నీ వృక పదంయొక్క దాయాది పదాలే. మనం అతి హీనంగా భావించే తోడేలు ఒకప్పుడు గౌరవంగా బ్రతికి వుండాలి. మేన భీమునికి మరో పేరు 'వృకోదరుడు' కదా!

---

*(98వ పేజీ తరువాయి)*

(మార్క్సిజమ్ అవగాహనలోనూ, కమ్యూనిజం ఆచరణలోనూ వైరుధ్యాలు వచ్చినప్పుడు ఏమైంది? పార్టీ చీలిపోయింది కదా) ఏమతం అయినా పౌరహక్కులకు విరుద్ధంగా ఎంతోకాలం కోనసాగలేదు. మత సంప్రదాయాలు ఏవైనా స్త్రీలహక్కులకు విరుద్ధంగా కొనసాగుతూంటే, ఎప్పుడో అప్పుడు చట్టంలో మార్పులు తీసుకురాకతప్పదు. అప్పటి దాకా ఉద్యమం కొనసాగుతూనే ఉంటుంది. దానికి 'పోస్ట్ మాడరనిజం' అని ముద్ర వేయడం దేనికి; అది ప్రజలలో వస్తున్న చైతన్య లక్షణంగా అర్థం చేసుకోవలసి ఉంటుంది. ఎంత అత్యాధునికత అయినా, అది అభ్యుదయకరంగా ఉన్నప్పుడే సమాజానికి ప్రయోజనకరంగా ఉంటుంది. ఎప్పటికప్పుడు కొత్త నీటిని చేర్చుకుంటూ ప్రవహించే నది లాంటింది వ్యక్తి జీవితం. వ్యక్తి జీవితం అలా సాగినప్పుడే సమాజంలో అభ్యుధయానికి అర్థం ఉంటుంది.

## సవరణ:

మార్చి సంచికలో ''పోస్ట్ మాడర్నిజం మీద చర్చకు ఆహ్వానం'' లో ''హిరాక్లిటస్''కు బదులు ''ప్రొటాగరస్'' అని చదువుకోవాలి.

# వందేళ్ళ డా॥ కట్టమంచి 'ముసలమ్మమరణం'

– ముప్పాల సుబ్బరామయ్య

ఇరవయ్యో శతాబ్దం అడుగుపెడుతూ సాహిత్య లోకంలో ఓ లఘుకావ్యంగా ఆవిర్భవించి ఆధునికాంధ్ర కవిత్వానికి 'వేగుచుక్క'గా ప్రశంసించబడినది 'ముసలమ్మ మరణం' అనే కట్టమంచి రామలింగారెడ్డిగారి రచన.

1880 డిసెంబరు 10న చిత్తూరు జిల్లాలోని కట్టమంచిలో జన్మించారు రామలింగారెడ్డిగారు. ఊరు పేరే వీరి ఇంటి పేరు. తల్లి నారాయణమ్మ, తండ్రి సుబ్రహ్మణ్య రెడ్డి. వీరిది పూర్వం నుండి పండిత కుటుంబం. రామలింగారెడ్డిగారి ముత్తాత 'మహాకవి' పెదరామలింగారెడ్డిగారికి ఉన్నట్లే నుదుటి మీద పుట్టుమచ్చ ఉండడం చేత వారి పురోహితులైన కుప్పనయ్యంగారు ముత్తాత పేరు పెట్టమన్నారు.

చిన్నతనంలో మునుస్వామి మందడి గురువు, తండ్రి సుబ్రహ్మణ్యరెడ్డి, తరువాత చెన్నపురి క్రైస్తవ కళాశాలలో డా॥ మిల్లరు (ప్రిన్సిపాల్), డా॥ స్కిన్నర్ (తత్త్వశాస్త్ర అధ్యాపకులు), డా॥ కెల్లెట్ (చరిత్ర అధ్యాపకులు), ప్రొఫెసర్ వెంకటసుబ్బయ్య (గణితశాస్త్ర అధ్యాపకులు) ల నేతృత్వంలో పరిణితి చెందిన రామలింగారెడ్డిగారు మేధావేకాదు వ్యుత్పన్నుడు. పండితుడే కాదు రసజ్ఞుడు, వ్యక్తేకాదు రచయిత, ఆధర్శవాదే కాదు రాజనీతిజ్ఞుడు - ఇన్ని ప్రజ్ఞాపాటవాలు నిండి ఉన్న నిండు ప్రతి భావంతుడు.

ప్రాచీన ఆంధ్రకవులైన తిక్కన భారతాన్ని, సూరన కళాపూర్ణోదయాన్ని ఔపోసన పట్టిన వీరి కవి హృదయంలోంచి విద్యార్థి దశలోనే అంటే పంతొమ్మిదవ యేటనే ప్రౌఢ కవితా శైలి అబ్బి, ప్రబంధ కవుల బాణీ అలవడి జాలువారినది 'ముసలమ్మ మరణం' అనే లఘుకావ్యంలో.

చెన్నపురి క్రైస్తవ కళాశాలలో 'శ్రీమదాంధ్ర భాషాభి రంజనీ సమాజము' ఉండేది. దానికి పోషకులు శ్రీ సమర్థి రంగయ్య సెట్టి. ఆయన అందులో కొత్తగా బహుమాన కావ్య పద్ధతి ప్రవేశ పెట్టారు. ఆ పోటీ పరీక్షకు కట్టమంచి రామలింగారెడ్డిగారు 'ముసలమ్మ మరణం' అనే లఘు కావ్యం రచించారు. అనంతపుర మండల చరిత్రలోని ముసలమ్మ గాధ రెడ్డిగారి హృదయాన్ని స్పందింపజేసింది. 1899 లో కావ్య నిర్మాణము జరిగి, మరుసటి సంవత్సరమే ప్రకటింపబడి ఆంధ్రసాహిత్య రంగంలో ఒక సంచలనానికి దారి చూపింది.

రామలింగారెడ్డిగారు 'ముఖపత్రం' లో ''ఒకానొక త్రిలింగదేశీయునిచే వ్రాయబడి, బ్రౌన్ దొరగారిచే బ్రకటింపబడిన 'అనంతపుర చరిత్రము' అను గ్రంధము నుండి యిందలి కథఁగైకొంటిని. అయినను కొన్ని యెడల రసాధిక్యమునకై నూతన కల్పనలు చేసినాడ'' అన్నారు.

పంపాతీరంలోని విద్యానగరాన్ని బుక్కరాయలు పాలిస్తుండేవాడు. విద్యానగరం దక్షిణ ప్రాంతంలో నందేలి తాలూకాలో దేవరకొండ దగ్గర కంబుగిరి స్వామి కొండలో పుట్టి ప్రవహిస్తున్న పాండు నదిని మంత్రి చిక్కప్ప వొడయరు చూచి, దాన్ని దేవరకొండకు అడ్డము కట్టి, ఒక చెరువును తవ్వించి దాని రెండు వైపుల రెండు గ్రామాలు నిర్మించాడు. చెరువుకు తూర్పు వైపున ఉన్న గ్రామానికి రాజుగారి పేర

బుక్క రాయసముద్రమని, రాణిగారి పేర పడమట వైపు గ్రామానికి అనంత సాగరమని పేర్లు పెట్టాడు. బుక్కరాయ సముద్రానికి దక్షిణంలో పదహారు కోసులదూరంలో యలమంచినాడు తాలూకాలో వరగిరి వెంకటేశ్వరుని కొండలో పుట్టి ప్రవహిస్తున్న చిత్రావతి నదిని చూచి వొడయరు పూర్వం మాదిరి అక్కడ కూడా ఒక చెరువు నిర్మించి దానికి రెండు వైపుల రెండు గ్రామాలు నెలకొల్పి తూర్పు వైపు గ్రామానికి బుక్కపట్నమని, పడమటి వైపు గ్రామానికి అనంత సాగరమని పేర్లు పెట్టి అక్కడే అదృశ్యమయ్యాడు.

కొంత కాలానికి బుక్కరాయ సముద్రపు చెరువుకి బాగా కురిసిన వర్షాలవల్ల నిండి పొంగి పొరలుతూ గండి పడింది. గ్రామ పెద్దలు, జనం వచ్చి చూస్తుండగా ఒక స్త్రీకి పూనకం వచ్చి 'నేను గంగా భవానిని. నాకు ఆహారం నరబలి యిస్తే ఇక్కడ వుంటాను. లేదా ఇక్కడ వుండనని' చెప్పింది. గ్రామస్తులు, పెద్ద మనుషులు ''బలి' గురించి ఆలోచిస్తుండగా బుక్కరాయ సముద్రములో ఉన్న బసిరెడ్డి చివరి ఏడో కోడలు ఈడురాని ముసలమ్మ అనే చిన్నదాన్ని గంగాదేవి పూని నీవు బలిరావాలి అని చెప్పింది. ఆమె బలికి సిద్ధమై శుభ్రమైన చీరకట్టి, పసుపు కుంకుమ పెట్టుకుని, చేత నిమ్మ పండ్లు పట్టుకుని బయలుదేరి కట్టమీదికి వచ్చి మామ అయిన బసిరెడ్డి కాళ్ళకు మ్రొక్కి, గ్రామస్తులకు నమస్కరించి 'నాకు గంగాభావాని సెలవైనది, నేను బలియై పోతా' నని చెప్పి రాయబారము తూముకు మూపై అడుగలపైన గండిపడి నెరి ఏర్పడగా, ఆ నెరిలోనికి పోయి నిలిచినది. ఆమె మీద ప్రజలు రాళ్లు, మట్టి పోశారు. అంతట కట్ట నిలిచింది.

ఆ తరువాత రోజు బలియైపోయిన ముసలమ్మ ఆ గ్రామంలోని స్త్రీమీద పూని - శిలారూపంలో తన బొమ్మను చేసి చెట్టు క్రింద పెట్టి కొలవమని చెప్పింది. ఆ ప్రకారమే కొలుస్తున్నారు కాని గుడిలేదు. ఆ గండిప్రాంతంలో వచ్చి పోయే జనం 'ముసలమ్మా!' అని పిలిస్తే, ఆమె ' ఓ' అని పలుకుతూ వుండేది. ఇలా ఉండగా ఓ రోజు రాత్రి గడ్డికి పోయే వారు మామూలు ప్రకారం పిలిచారు, పలికింది. అప్పుడు 'చచ్చినా నీ కావరము విడువక పోతివి' అని వారు అన్నందున ఆనాటి నుండి పలకడం లేదు. కాని ఆ ముసలమ్మకు పూజలు జరుగుతున్నాయి.

ఇదీ అసలు కథ. దీనిలో కొంత తీసుకుని, మార్పులు చేసి, కొంత కల్పన చేసి రెడ్డిగారు లఘు కావ్యం రచించారు. మూల కథలోని చెరువుకు గండి పడడం, ముసలమ్మ బలి కావడం అనే అంశం మాత్రమే తీసుకున్నారు రెడ్డిగారు.

చెరువు నిండి పొరుతుండగా ''పురజనులు వచ్చి చూస్తూ వుండగా'' అని మాత్రం మూలంలో ఉంది. ఈ సంబదర్భంలో - ఇంత వర్షం ముందెన్నడూ మనం చూడలేదని, భక్తితో పోలేరమ్మకు పొంగలి పెట్టాలని నిశ్చయించి, చాటింపు వేసి, స్త్రీ పురుషులంతా కూడి కోళ్ళను, పొట్టేళ్ళను వెంట తీసుకొని పోయి, పొంగళ్లు దింపి, బలులిచ్చి కాళిని భక్తితో పూజించి, రక్కసుని వలె పొంగివచ్చే ఈ చెరువు బారి నుండి తమను రక్షించమని కోరినట్లు ఒక సన్నివేశాన్ని కల్పించి చిత్రించారు.

గంగాభవాని ఒకసారి ఒకస్త్రీని, మరోసారి ముసలమ్మను ఆవేశించి బలికోరిన విషయాన్ని రెడ్డి గారు మార్పు చేశారు. గంగాభవానికి ఒక నిశ్చితాభిప్రాయం లేదేమోననే కళంకం రాకుండా పురాణాలలో కనిపించే ఆకాశవాణి పలుకులలో ముసలమ్మను బలి కోరినట్లు మార్పు చేశారు. ముసలమ్మ ఈడేరని చిన్నదన్న విషయాన్ని, ఆమె ఒక కొడుకును కన్నతల్లిగా రెడ్డిగారు మార్చినారు. గ్రామ ప్రజల కొరకు తనంత తాను బలి అయ్యే విషయాన్ని ఆలోచించి ఓ నిర్ణయానికి రావడానికి తగిన వయసుండాలని. ఓ బిడ్డ తల్లిని చేశారు ముసలమ్మను. (చిత్రమేమిటంటే, ఇంగ్లీషులో సి. ఆర్. రెడ్డి జీవితం రచించిన డి. ఆంజనేయులు గారికీ, పి. రాజేశ్వరరావు గారికీ గూడా 'ముసలమ్మ' వృద్ధాంగనగా కనిపించడం - చోద్యానికే చోద్యం! - ఆంధ్రజ్యోతి 11-12-1980)

రెడ్డిగారు చేసిన మరోమార్పు ముసలమ్మ ఆత్మబలికి అనుమతి కోరడం - ముసలమ్మ నవ్వుతూ - తన భర్త దగ్గరకి పోయి, తాను బలికాదలచుకున్న విషయాన్ని చెప్పటం, అతడు బాధపడి నేనూ నీ వెంట వస్తాను, ఊరు విడిచి వెళదామనడం, ఆమె ఊరు విడిచి వెళ్ళడం బాగుండదు. మీకు కోపం వస్తే నా నిర్ణయాన్ని మార్చుకుంటానని చెప్పడం. అప్పుడతను నీ మాట ఎప్పుడైనా కాదన్నానా! అనడం, ఊరు విడిచి బ్రతుకు తెరువుకి వేరే ఊరికి వెళ్ళడం చాలా కష్టం. 'ప్రజలకు మేల్చేయన గూర్చని తనువెందు' కని భర్త వ్రాసి తనకు లోగడ వినిపించిన పద్యాన్ని ఆమె అతనికి గుర్తు చేయడం, నే చేసే పనివల్ల మీకు కీర్తి కలుగుతుందని, 'ఏదీ నన్నడుగవే' మని ఇదివరకు అనేవారు, తీరా ఇప్పుడు నోరు తెరిచి అడిగేసరికి కాదంటారా! అనడం, అతను మౌనంగా అంగీకరించడం, అదే సమయానికి అత్తమామలు రావడం, వారికి కూడా నచ్చబలికి తాను బలికావడానికి ఒప్పించడం, కొడుకుని ముద్దాడి, బుజ్జగించి పోయి వస్తానని చెప్పి భర్తకు అప్పగించడం, ప్రజలను చూచి, వారు చూపిన ప్రేమకు తాను ఋణపడివున్నానని, ఆ ఋణాన్ని తాను ఈ విధంగా తీర్చుకోవాలనుకున్నాను కాబట్టి, కాదనకుండా బలికావడానికి తనకు అనుమతి నివ్వమని ముసలమ్మ కోరడం రెడ్డిగారు కల్పించిన కరుణారసాత్మక మార్పు.

ముసలమ్మ చెరువు కట్టకు పడిన గండిలో నిలిస్తే ఆమె మీద మట్టి రాళ్ళు వేసి ప్రజలు ఆ గండి పూడ్చినట్లు మూలంలో వుంది. అంటే కృతజ్ఞత చూపాల్సిన ప్రజలే అమానుషంగా ఆమె ప్రాణం తీసినట్లు, ఆ గ్రామ ప్రజలకు కృతజ్ఞత, మానవత్వం లేనివారనే అభిప్రాయం కలగరాదని రెడ్డిగారు ముసలమ్మ చెరువు నీటిలో మునిగిపోయినట్లుగా మార్చారు. ఈ విధమైన మార్పులు చేర్పుల వలన కావ్యశోభ పెంపొందింది.

కావ్యం విషాదాంతంగా ముగిసినా, మరణం లోక కళ్యాణానికి కాబట్టి సుఖాంతమైంది. చిన్న వయసులోనే తక్కువ కాలవ్యవధిలో ప్రాచీన సాంప్రదాయాన్ని విడిచి పెట్టక ఆధునిక సాంప్రదాయాన్ని కొంతవరకు అనుకరిస్తూ సముచితమైన మార్పులు చేసి ఆధునిక ఖండకావ్యశ్రీకి పుష్టి చేకూర్చిన రెడ్డిగారు ధన్యులు! చిరస్మరణీయులు !!

కట్టమంచి వారి 'ముసలమ్మ మరణము' ప్రభావం తరువాతి కవులపై ప్రసరించింది. దువ్వూరి రామిరెడ్డిగారి 'నలజారమ్మ', డాక్టర్ చిలుకూరి నారాయణరావుగారి 'ముసలమ్మ' (పదము), రాయప్రోలు 'స్నేహలత', జాషువా 'ఖండకావ్యాలు' మొదలైన వాటి మీద ఎంతటి ప్రభావం చూపిందో తెలుస్తుంది.

ప్రాచీన ప్రబంధ కవుల చర్వితచర్వణమైన రచనా విధానాన్ని తరువాత తరువాత రెడ్డిగారు దుయ్యబట్టారు. అందువలన ''కట్టమంచి రామలింగారెడ్డి ప్రబంధ కవిత్వాన్ని అంతగా చెడదిట్టిపోయినా, తెలుగు కవిత్వానికి ఆయన ఒక దారీ తెన్ను చూపించలేకపోయారు. అనగా తెలుగు కవిత్వానికి ఆయన చేసిన Pasitive Contribution యేమీ లేదు. ప్రబంధ కవిత్వం 19వ శతాబ్దిలోనే చచ్చిపోయింది. ఆ శవానికి అంత్యక్రియలు చేసిన ఘనత మాత్రమే రామలిగారెడ్డిగారికి దక్కింది. ప్రబంధ కవిత్వం తర్వాత మనకు వచ్చిన భావకవిత్వ దశ ఆయన ఊహకే అందలేదు. నిజానికి చారిత్రకంగా అయనది ముందు చూపుకాదు, వెనుక చూపు. ఆయనకు తెలుగు కవిత్వంలోకెల్ల అత్యుత్తమమైన కవిత్వం తిక్కన్నలోనూ, సూరన్నలోనూ కనిపించింది. వాళ్ళే మనకు ఆదర్శం అన్నారు. ''ఇంగ్లండులో చదువుకొని కూడా ఆయనకు రొమాంటిక్ ఉద్యమ వాసన అంటలేదు. తెలుగులో కూడా రొమాంటిక్ కవిత్వం రాబోతున్నదని జోస్యం చెప్పేశక్తి లేకపోతే మానె, రాదగి ఉన్నదని ఆహ్వానించే సంస్కారం ఆయనకు లేక పోయింది. ప్రబంధ కవిత్వాన్ని అంత ద్వేషించిన వాడు తానే కవిత్వం రాయబోయేటప్పటికి అది కథా నిర్మాణంలోనూ శృంగారవర్ణనలు పరిహసించడంలోనూ ప్రబంధ కవిత్వాని కంటే భిన్నంగా ఉండింది కాని, పద్యాలశైలి, సమాస నిర్మాణం, పదాల కూర్పు, కవి సమయాలు మొదలయిన కవితా సామగ్రి విషయంలో అది ప్రబంధ కవిత్వానికి నకిలీగా తయారయింది'' అని శ్రీ రాచమల్లు రామచంద్రా రెడ్డిగారు నిశితంగా విమర్శించారు.

కట్టమంచి రామలిగారెడ్డిగారు చిన్నవయస్సులో 'బహుమాన కావ్య పద్ధతి ననుసరించి ఈ కావ్యమును రచియించితిని' అని చెప్పారు. తమకు భాషపై గల అధి కారాన్ని నిరూపించుకోవడానికి వీరి రచనను గ్రాంధిక భాషలో చేసి ఉండవచ్చు. సంస్కార ప్రియులు శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారు కూడా మొదట్లో ''శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచననైషధం'' వ్రాసి శ్రీ కొక్కొండ వెంకటరత్నం పంతులు వంటి పండితుల మన్ననలు పొందిన తర్వాతనే పామరులలో కూడా తమ సంస్కార వాదాలకు ప్రచారం లభించడానికి శిష్టవ్యవహారానికి వచ్చారు.

విమర్శకులు ఇది కేవలం ఆధునిక కావ్యమే అనుకుని భ్రాంతి చెంది లోతుగా పరిశీలించి కావ్యమంతా ఆధునికమైన పోకడలో కనిపించక పోయేసరికి రెడ్డిగారిని ప్రబంధపక్షపాతి అని ఘాటుగా విమర్శించడం జరిగి ఉంటుంది. ''ఇది ప్రాచీన కావ్యమూ కాక, ఆధునిక కావ్యమూ కాక ఈ రెండింటికి మధ్య ప్రభవించిన 'సంధి 'కావ్యమనవచ్చు'' నని డాక్టర్ సి. నారాయణ రెడ్డి గారి అభిప్రాయం.

రెడ్డిగారి 'ముసలమ్మ మరణం' ఉదయించి వందేళ్ళు. వందేళ్ళ చరిత్రగల 'ముసలమ్మ మరణం' ఇంకో వందేళ్ళు జీవించి ఉంటుంది గాక!

# కథకు సమాజ చరిత్ర నేర్పిన కథకుడు రా.వి.శాస్త్రి

– జయంతి పాపారావు

జీవితాన్ని జీవితం నుండి మాత్రమే నేర్చుకోగలం. ప్రజా జీవితాన్ని ప్రజా జీవితంనుండి మాత్రమే నేర్చుకోగలం సమాజాన్ని సమాజం నుండి మాత్రమే నేర్చుకోగలం. అటువంటి అభిప్రాయం రా.వి.శాస్త్రికి రచన ప్రారంభించిన నాటినుండి వుంది. 1960 నుండి అది బలపడి సాహిత్య దృక్పథంగా స్థిరపడింది.

రా. వి శాస్త్రికి వివిధ వర్గాలకు చెందిన మనుషులతో, ప్రజలతో సన్నిహిత పరిచయం, సంబంధం వుంది వేలిముద్ర కూడా వేయలేని మనుషుల నుండి వేయిపడగలెత్తిన మనుషుల వరకూ పరిచయం కలవాడు వేలిముద్ర కూడా వేయలేని మనుషులతో మాట్లాడుతూ వారి జీవితాన్ని వారి మాటల్లోనే వారి నుండి నేర్చుకోగలిగేడు. కష్ట జీవులతో పీడితులతో పరిచయం కలవాడు. చిన్న ఉద్యోగుల నుండి పెద్ద అధికారుల వరకూ పరిచయం స్నేహం కలవాడు. రోడ్డు మీద గేదె పేడ లెత్తే మనుషుల నుండి ప్రజల బుర్రమీద పేడబురద జల్లే ప్రజానాయకుల వరకూ ఎంతో కొంత పరిచయం కలవాడు విద్యార్థులు - ఆచార్యులు - లాయర్లు - డాక్టర్లు - మేధావులు - వ్యాపారస్థులు - పెట్టుబడిదార్లు - పారిశ్రామిక వేత్తలు - కార్మిక నాయకులు - కళాకారులు - రచయితలు - నటులు - గాయకులు - బ్రహ్మ జ్ఞానులు - ఆటగాళ్ళు - జూదగాళ్ళు - తాగుబోతులు - పొరంబోకులు - దగాకోర్లు - మోసగాళ్ళు లాంటి వారితో ఎక్కువో తక్కువో పరిచయం కవలవాడు. స్నేహం కలవాడు.

వృత్తి - ప్రవృత్తి - వీటితో రా. వి. శాస్త్రి తనదైన విస్తృతమైన ప్రపంచం నిర్మించుకున్నాడు. తనదైన విశాలమైన ప్రపంచం నిర్మించుకున్నాడు.

రా. వి. శాస్త్రి స్నేహశీలి. వినయం కలవాడు. వినమ్రుడు. ఎవరిదగ్గర నుంచి తన కోసం ఏ సాయం ఏ డబ్బో ఆశించని వాడు. కీర్తి కోసం - ప్రతిష్టకోసం - డబ్బుకోసం - ఎప్పుడూ ప్రాకులాడనివాడు

అర్వై సంవత్సరాల వయసుపై బడిన అనుభవజ్ఞులతో అతివినయంగా వుండగలిగిన రా.వి.శాస్త్రి, ఇరవైసంవత్సరాలు కూడా నిండని యువకుల భుజం మీద చెయివేసి కులాసాకబుర్లు చెబుతూ తిరగ గలిగేవాడు

''ఇతడు నిజంగా నిర్దోషి. ఏమీ లేనివాడు. ఇతడికిసాయం చేయండి'' అని పోలీసు ఆఫీసర్ల యిళ్ళకు కూడా వెళ్ళి అర్థించేవాడు, అలాగే ''ఇతడు కడుబీదవాడు. మీకేమీ యివ్వలేనివాడు, ఇతడికి మీరు అన్యాయం చేస్తున్నారు.'' అని పోలీసు ఆఫీసర్లని మొహం మీద తిట్ట గలిగేవాడు.

అటువంటి ఉత్తమ లక్షనాలు కల సహృదయుడు రా. వి. శాస్త్రి, అందుకే అతడు అంత విస్తృతమైన అంత విశాలమైన తనదైన ప్రపంచం నిర్మించుకోగలిగేడు. తను నిర్మించుకున్న తనదైన ప్రపంచం నుండి నేర్చుకున్న జీవితాన్ని తనదైన దృష్టితో, తనదైన దృక్పథంతో, తనదైన కంఠంతో, తనదైన శిల్పంతో కథలుగా చెప్పేడు అందుకే అతడు కథకు జీవితం - ప్రజాజీవితం - సామాజిక జీవితం - నేర్పగలిగే కథలు రచించగలిగేడు.

కథకు సమాజ చరిత్రను నేర్పే ''టూకీ కథలు'' రా. వి. శాస్త్రి ''సృష్టి'' అని చెప్పుకోడం సమంజసంగా వుంటుంది.

రా. వి. శాస్త్రి కథకు కథలు నేర్పేడు.

1960 వరకూ రా. వి. శాస్త్రి ''మనుషుల''ను పాత్రలుగా స్వీకరించేడు. ఆ తర్వాత ''ప్రజల''ను పాత్రలుగా స్వీకరించేడు.

కలం పట్టినప్పుడు మాత్రమే రా.వి.శాస్త్రి రౌద్ర రుద్రుడు. గొప్పమేధావి. రచించడంలోరాజీలేని రచయిత రచనలో రా.వి.శాస్త్రి - రా.వి.శాస్త్రే కానీ ''రాజీశాస్త్రి'' కాదు.

తనకు సాహిత్యం పట్ల ''అభిరుచి'' కలిగించిన సాంప్రదాయ కవుల పాదాలు వినమ్రుడై స్పృశించినా, వ్యక్తి పరమైన సంబంధాలకు అతీతంగా - అలాగే తన కుటుంబంలోని పూర్వులు నిర్వర్తించిన వృత్తికి అతీతంగా - ''బ్రహ్మజ్ఞానం'' బట్టలూడదీసే '' బుద్బుదం - పిపీలికం - ఈ ప్రేమలోకంలో - కొంగల దేముడు'' లాంటి కథలు రచించేడు. అలాగే తనకు ''మార్క్సిజం'' పట్ల ''అభి మానం'' కలిగించిన చిన్నతరహా కార్మిక నాయకులతో తనకు కల అత్యంత సన్నిహిత స్నేహసంబంధాలకు అతీతంగా, వేతన వాదపు కార్మిక సంఘ వ్యవస్థ నిజరూపాన్ని - ఆవిషాద చరిత్రను - కార్మికుల ముందు నగ్నంగా చూపించే కథలను రచించేడు.

ఆ కథలను ఇప్పుడు పరిశీలించిచూద్దాం

''పాతదేకథ'' **1968**లో రచించేడు. ఇది కంచికివెళ్ళని కథ. ఎందుచేతనంటేఎండు కూలీలంతా ఎండలోనేవున్నారు. భూకామందుల వ్యాపారపు కొడుకులు లాభాలు వేటలో ఇంకా ఈ లోకంలోనే, మనపీకల మీదే వున్నారు.

ఇప్పుడు భూకామందులవారు వ్యాపారపు కొడుకులకు ఉపదేశించిన ఉపదేశం చూద్దాం:

''మనం బాగుపడాలంటే కూలి వాండ్రు చావనూ చావకూడదు. బతకనూ బతకకూడదు. వారు చస్తే మనికి ఎట్టి లాభము సంపాదించే అవకాశమున్నూ ఉండదు కనుక మన లాభములకు కొంత నష్టము కలిగిననూ వారిని మనము కొంతవరకూ కొనవూపిరితో వుంచవలెను. నూరు రూకల లాభమునకు ఒక రూక ఖర్చుయిన మన సొమ్మేమి పోయినది? అందుచేత నేటి నుండి వారికి మీరు మనిషికి ఇంత ఎండుగడ్డి, ఇంత (ఉప్పు బద్ద కలిపిన) మంచినీరూ, అని నిర్ణయించి ఇచ్చివారు చావకుండా చూచుకొనండి'' ఇదీ ఆ ఉపదేశం యొక్క మొదటి భాగం

''భూకామందు'' మరియు ''వ్యాపారపు కొడుకులు'' అనుమాటలు ధనిక స్వామ్యం ఎలా పెట్టుబడి దారీ స్వామ్యంగా పరిణామం చెందిందో సూచించగలవు. ఆ ఉపదేశం ''వేతనవాద''పు సారాశం చిత్రిస్తోంది పెట్టుబడి శక్తులు శ్రమశక్తిని ఎలా దోచుకుంటూ వుంటారో చెప్తోంది. శ్రమశక్తుల ''అజ్ఞానం'' మీద దోపిడీ వ్యాపారం ఎలా సాగుతుందో విశ్లేషిస్తోంది. పెట్టుబడికి శ్రమ పట్ల కల ''వైరుధ్యాన్ని'' వివరిస్తోంది. పెట్టుబడి దారీ వ్యవస్థ యొక్క దోపిడీ స్వరూప స్వభావాలు స్పష్టం చేస్తోంది

భూకామందు వారి ఉపదేశంవల్ల వ్యాపారపు కొడుకులు ప్రభావితులై అప్పటి నుండి కూలీలందరికి రెండేసి పరకల చొప్పున ఎండుగడ్డి, మూడేసి చుక్కల చొప్పున ఉప్పునీరూ సప్లయి చేస్తూ, ఆ వ్యాపారపు చోరపుత్రులు ''ఇదే సోషలిజం'' అన్నారు. అప్పుడు చోర నాయకులు కొందరు కార్మిక నాయకులుగా మారి ''అవునిదే సోషలిజం'' అని అరిచి అరిచి చెప్పేరు.

గడ్డి పరకలూ - ఉప్పునీటి చుక్కలూ - ఏమిటి? వేతనాలు! కార్మికనాయకులు కార్మికులను వేతన వాదపు బురదలో ఎలాదించేశారో - ఆ విషాద పరిణామాన్ని యీ కథ విశదీకరిస్తోంది.

ఆ పరిణామం సోషలిజాన్ని ఎలా తప్పుగా నిర్వచిస్తోందో - కార్మికులను ఎలా తప్పుదారి పట్టిస్తోందో - పెట్టుబడి దారీ పాలక వర్గానికీ పెట్టుబడి వర్గానికీ వారి వారి లాభాలకీ ఆధిపత్యానికి ఎలా అండగా నిలబడుతోందో - కార్మికులు పోరాట మార్గంలో ఆధిపత్యంవైపు వెళ్ళకుండా కార్మిక

శక్తినడుం ఎలా విరగ్గొట్టిందో - లాంటి అంశాలు యీ కథ చదివే సందర్భంలో పాఠకులు గుర్తించగలరు.

భూకామందు ఉపదేశం ఆశ్చర్యకరమైన ఆలోచనను పాఠకులకు కలిగిస్తుంది ''పెట్టుబడి దారీ ప్రజాస్వామ్యం'' యొక్క స్వరూప స్వభావాలు ''పెట్టుబడి'' కలిగి వుంటుంది. అలాగే ''పెట్టుబడి'' యొక్క స్వరూప స్వభావాలు ''పెట్టుబడి దారీ ప్రజాస్వామ్యం'' కలిగివుంటుంది. అది చారిత్రకమైన సామాజిక సత్యం.

అటువంటి సందర్భంలో --- పెట్టుబడి శక్తులు కూలివాండ్రు చావకుండా కొంత వరకూ కొనవూపిరితో వారి ''లాభం'' కోసం ఎలా వుంచుతూ వుంటారో - అలాగే పేద ప్రజలను కూడా చావకుండా కొంతవరకూ కొనవూపిరితో ''ఓటు'' కోసం పెట్టుబడిదారీ ప్రజాస్వామ్యం వుంచుతూ వుంటుందా? అటువంటి ప్రశ్న వేసి పెట్టుబడిదారీ ప్రజాస్వామ్యపు కార్మిక, కర్షక వ్యతిరేక అప్రజాస్వామిక స్వరూప స్వభావాలను యీ టూకీ కథ నగ్నంగా చూపిస్తోంది.

భూ కామందుల వారి ఉపదేశం యొక్క రెండవ భాగం చూద్దాం:

''---- ఆదిశంకరుడు ఏమి చెప్పెను? జ్ఞాన మార్గమే అసలు మార్గమని అనలేదా అతడు?! అందుచేత కూలీజనులకు జ్ఞాన మార్గములన్నీ బంద్ చేయుడి! సెక్సు సినీమాలు చూపించండి! సురాపానము చేయించండి! మరొక రెండు గడ్డి పరకలు పడవేయండి! కాని జ్ఞాన దీపాలు వారు వెలిగించుకోకుండ మాత్రం మీరు బహుపరాగ్గా ఉండండి'' అని విశదీకరించేడు.

కూలీజనులు ''పిపీలిక జ్ఞానం'' పొంది ''పిపీలిక కర్తవ్యం''వైపు వెళ్ళిపోకుండా పెట్టుబడి దారీ ప్రజాస్వామ్యం - పెట్టుబడిశక్తులూ - ఆ ఉపదేశంలో చెప్పిన దానికంటే ఎన్నో రెట్లు ఎక్కువగా ప్రసార మాధ్యమాల ద్వారా - సురాపానం ద్వారా - అలాంటివాటి ద్వారా - ప్రజలను తప్పుదారి పట్టిస్తూనే వున్నారు కదా!

ఇప్పుడు మనం ''వేతన శర్మ''ని కలుసుకుందాం -------

కూలీలందరికీ రెండేసి పరకల చొప్పున ఎండుగడ్డి, మూడేసి చుక్కలచొప్పున ఉప్పునీరూ సప్లయి చేస్తూ వ్యాపారపు చోరపుత్రులంతా ''ఇదే సోషలిజం!'' అన్నప్పుడు ''అవునిదే సోషలిజం!'' అని మన ''వేతన శర్మలు'' అలా ఎందుకు అరిచేరో - ఆనేపథ్యచరిత్రను తెలుసుకుందాం.

ధనికస్వామ్య పెట్టుబడిదారీ ప్రజాస్వామ్య రాజవర్గ దోపిడీ శక్తులతో పెట్టుబడిదారి దోపిడీశక్తులతో చేతులు కలిపి, ఉద్యోగుల వర్గాన్ని కార్మిక కర్షక విప్లవ శక్తినుండి విడదీసి, విప్లవశక్తికి వెన్నుపోటు పొడిచిన వేతనవాదపు చరిత్రను యీ కథ చరిత్రీకరించింది. వేతన శర్మలు విప్లవ చరిత్రను ఎలా తప్పుదారి పట్టించారో - ఆ విషాద చరిత్రను చరిత్రీకరించింది.

రాజవర్గం వారి అనుయాయులూ అంతా కలసి ప్రజల్ని పీడించి దోచుకుతినడం చూసిన మార్కండేయ మహర్షి, ప్రజలే రాజులైతే తప్ప ప్రజలు మరింక బాగుపడేది లేదని గ్రహించేడు. ''రాజునీ అనుయాయుల్నీ పారదోలండి! మీ రాజ్యం మీ రేలుకోండి!'' అని ప్రజలకు బోధించేడు. ప్రజానీకం, రాజవర్గం మీద తిరుగుబాటు చేసింది. ఈ తిరుగుబాటులో అందరితో పాటు చిన్న జీతాల మీద బతకలేక పోతున్న ఉద్యోగుల వర్గం కూడా చేరింది. అందరి తిరుగు బాటు దార్ల మీద రాజ్యహింస చెలరేగింది. కరణకుల తిలకుడైన ''వేతనశర్మ'' ''నేనెవర్ని?'' అని ప్రశ్నించుకొని ''నేను కరణాన్నే కాని మరెవణ్ణీ కాను.'' అని ఖచ్చితంగా తేల్చుకున్నారు. తన అనుయాయులైన చిన్న ఉద్యోగుల వర్గాన్ని పిలిచి, మార్కండేయ మహర్షి ఉపదేశాన్ని విశ్లేషించి చెప్పాడు.

''ప్రజలు వేరు, రాజ వర్గం వేరు, రాజ వర్గం ప్రజల కష్టాన్ని దోపిడీ చేసి బతుకుతోంది. ఈ దోపిడీ వర్గం మీద తిరుగుబాటు చేసి, వారిని తరిమిపారేసి, లేదా అణిచిపారేసి, లేదాహతమార్చి పారేసి దోపిడీని రూపుమాపితేనే, ప్రజలు బాగుపడతారు తప్ప మరో విధంగా ప్రజలు బాగుపడరు అదీ మార్కండేయుడు మనకి చెప్పిన విషయం.------- ఎవరి దగ్గరైనా దోచుకొందికి ఏదైనా ఉంటేనే దాన్ని ఇతరులు దోపిడీ చెయ్యడం జరుగుతుంది. పంటలు పండిచే వాళ్ళూ, సంపద సృష్టించేవాళ్ళూ ఎవరూ అంటే వాళ్ళు - కర్షకులూ, కార్మికులూనూ. రాజవర్గం వాళ్ళనే దోస్తుంది ------- మహారాజు వారు చేసే దోపిడీలు వారికి వసూళ్ళు చేసి పెట్టి లెక్కలు రాసి పెడుతున్నందుకు వారు మనకి జీతాలు ఇస్తున్నారు. రాజుగారు మనకి సరైన జీతాలు ఇవ్వకపోడం వల్ల మార్కండేయుడి మాటలు విని తిరుగుబాటులో చేరేం.... మనకి వేతనాలు పెరిగి, కొన్ని సదుపాయాలు కలిగినట్లయితే మనికి ఏ ఇబ్బందీ ఉండదని మనం తెలుసుకున్నాం. ఆ పాటి దానికి మనం తిరుగు బాటులో చేరడం ఎందుకు? చిత్ర హింసలకి పాలవడం ఎందుకు?.... మనకి కావలసినవి జీతాలూ, సదుపాయాలూను. ''మాకు వేతనాలతోనే సంబంధం వుంది. కాని విప్లవాలతో సంబంధంలేదు.'' అని చెబుదాం.'' అని కరణకుల తిలకుడైన వేతనశర్మ చెప్పేడు ఉద్యోగుల వర్గం సంతోషంగా అవునంది. ఉద్యోగుల వర్గానికి వేతనాలు పెరిగాయి. ఎక్కువ జీతాల కోసం సమ్మెలేతప్ప సమసమాజం కోసం విప్లవాలు వద్దని ఉద్యోగుల వర్గం తేల్చేసుకుంది ఇదీ క్లుప్తంగా కథ.

ఏ విశ్లేషణా అవసరం లేనంత స్పష్టంగా రచించిన కథ ఇది.

వేతనశర్మలు సాధించిన ఘనవిజయాలేమిటి? వేతన వాదపు చరిత్ర సాధించిన గొప్ప విజయాలేమిటి? ఈ కథ వివరంగా జవాబు చెప్తోంది. ఉద్యోగుల వర్గాన్ని విప్లవశక్తి నుండి విడదీసేరు! ఎక్కువ జీతాల కోసం సమ్మెలే కాని సమసమాజం కోసం విప్లవాలు వద్దని వ్యవస్థీకరణ చేసేరు! ఉద్యోగుల వర్గానికి ఎక్కువ జీతాల కోసం ''సమ్మె'' హక్కుతో పాటు ''లంచం'' హక్కు కూడా సాధించి ''అవినీతి ఉద్యోగుల వర్గం'' నిర్మించేరు! అటువంటి వేతన వాదపు వర్గాన్ని నిర్మించి, ఆ వర్గాన్ని దోపిడీ రాజ్యవర్గానికీ - దోపిడీ పెట్టుబడి శక్తులకూ - మిత్ర వర్గంగా నిర్మించేరు! ''సమ్మె'' మరియు ''లంచం'' అను రెండు ఆయుధాలు రెండు చేతులలోనూ ధరించిన ఈ వర్గం ప్రజలను పలువిధాలుగా పీడిస్తోంది! కార్మికులు - కర్షకులు - పేదప్రజలు - వీరికి '' ఉద్యోగుల వర్గం'' అను ''మూడో శత్రువు''ను నిర్మించేరు! ఇదీ యీ కథ యొక్క సారాంశం. ఈ విషాద చరిత్రను యీ కథ చరిత్రీకరించింది.

''ఈ ప్రేమ లోకంలో.. ..'' అనుకథ వర్గ సమాజంలో ''వర్గ శత్రుత్వమే''కానీ ''వర్గప్రేమ'' ఉండదను సామాజిక సత్యాన్ని విశదీకరిస్తోంది. ఈ విశ్లేషణ పెట్టుబడి దారుల పన్నాగంలో పడిపోకుండా, పీడిత వర్గానికి ఆయుధంగా ఉపయోగపడుతుంది.

''పిపీలికం'' కథ పీడిత వర్గానికి విముక్తి దారి చూపిస్తోంది

'' ఈ (భగవత్) సృష్టిలో న్యాయంలేదు, ధర్మంలేదు. సత్యం శివం లేనేలేవు. ఇంతవరకూ, కొంత వరకూ, సర్వజీవి జాలాన్ని సమన్వయ పరచి, సమానత్వం సాధించి, న్యాయం నిలబెట్టి ధర్మ సంస్థాపనకి తాపత్రయపడేదీ మానవుల్లో కోటికి ఒక్కడే, ఒక్కడే; కోటికి ఒక్కడైనా మానవుడే, మానవుడే!'' అని చెప్పి చంద్రుళ్ళా అస్తమించిన రా.వి.శాస్త్రి తూర్పున సూర్యుణ్ణి ఉదయింపజేస్తూనే వుంటాడు!

అటువంటి మానవుడు రా.వి.శాస్త్రి!

# కథానిక ప్రాభవం - ప్రభావం

## (అప్రధానం అనుకునే కొన్ని ప్రధానాంశాలు)

-శ్రీ విరించి

'కథానిక' అనేది వచన రచన, కల్పిత కథ అంతమాత్రం చేత అంతా ఊహా కల్పితమే అనుకోనక్కర లేదు. యదార్థ జీవితాన్ని సమీకరించుకుంటూ 'ప్రతిబింబం' లా తయారయ్యే ప్రక్రియ యిది.

ప్రతి కథకు మొదలు, మధ్య, చివర అనేవి ఉంటాయి. అవి అదే వరసలో వుండకుండా వుండడం చమత్కారం. చదువరి ఉత్సుకతను నిలిపి వుంచేది యీ లక్షణం కూడా.

ఒక సంఘటన లేకపోతే కథ లేదు నియమిత సమయంలో కొన్ని పాత్రలకు సంభవించే ఘటనలను కథగా కూర్చడం, ఆ వివరణల సముదాయం - కథానిక

కథకు ఒక సంవిధానం, సందేశం ఉంటుంది. ఇది తేలికగా అర్థం అయ్యేట్లు 'అక్షర రూపకల్పన' జరుగుతుంది. జీవితాన్ని గురించి, బతుకు బాటను గురించి, మానవ స్వభావాన్ని గురించి కథాంశం స్పర్శించుతుంది. సందేశం ప్రధానమైన విషయం కాగూడదు, అది సమకూర్చే సంవిధానం ప్రధానం. స్పష్టత, సూటితనం ముఖ్యం. నిరాశ, నిస్పృహ కలిగివుంటే సన్నివేశాలు, ప్రవర్తనా రీతులను దిగజార్చే సంవిధానాలు స్వీకరించడం కూడా మంచి పద్ధతి కాదు. కథలో యేదో 'ముడి' రావాలి. అడ్డుపడే సంవిధానం - దానిని అధిగమించి పాత్రలు ముందుకు వెళ్లే ప్రక్రియ - సూచితం కావాలి. 'ముడి' లేకపోతే కథే లేదు. ముడి విప్పక పోతే కథకు ప్రయోజనం లేదు. జీవితం 'వడ్డించిన విస్తరికాదు' అన్న సంగతి గమనించాలి. ఏ మనిషికి ఆ మనిషి తన చుట్టూ తనదైన జీవితాన్ని, ప్రపంచాన్ని 'గూడు' కట్టుకుంటున్నాడు.

కథ వ్రాయడం ఎవరయినా చేయగలరు, ఎలాగయినా కథ చెప్పవచ్చు - అన్న ధోరణులు మంచివి కాదు.

కథ అంతా కల్పనే. అబద్ధాల పుట్ట కావచ్చును. అయినా చదివేవాళ్ళ ఉత్సుకతను కొనసాగేట్లు చేయగల నేర్పు రచయితకు వుండాలి.

కథా రచయితకు ప్రాథమిక వ్యాకరణ సూత్రాలు, వర్ణ క్రమాలు తెలిసి వుండడం అవసరం. మనస్సుల్లోకి చొచ్చుకుపోయి చూడగల 'కన్ను' వుండాలి. పాత్రలు పడుతున్న అవస్థలను 'లోచూపు'తో చూడగల చాకచక్యం వుండాలి. నిరంతర జీవన పరిశీలనం రచయిత బాధ్యత.

చక్కని కథ రాయడంతోటే అది సాహిత్యపు విలువ సంతరించుకుంటుందను కోవటానికి వీలులేదు. మామూలు తెలివితేటలు చాలవు గొప్ప సాంఘిక దర్శనం వున్నప్పుడే సాహిత్య విలువల పోషణ ఒనగూడుతుంది.

జీవితాన్ని దర్శించడంలో, ప్రదర్శించడంలో ఒక నూతన ధృక్కు అవసరం. చాకచక్యం వుండాలి. చురుకుదనం కావాలి.

జాతి, మత, కుల, భాష, లింగ... యిలాంటి వివక్షలకు అతీతంగా వుండాలి. రచయిత మనస్సు, తన రచనా ప్రాంగణానికి తానే నాయకుడు, పెద్ద. కథలో జరుగుతున్న సంఘటనలు సమర్థనీయంగా వుండాలి. బలహీనతలను చెప్పేటప్పుడు కారణం చూపించగలగాలి.

రచన ఒక రోజులో- ఒక సంవత్సరంలో పరిపుష్టం అయ్యేది కాదు. నిరంతర జీవన పరిశ్రమ యిది. విద్యార్థిలాగ ఎప్పటికప్పుడు కొత్త సంగతులు నేర్చుకునేందుకు సిద్ధంగా వుండాలి. సవినయంగా పరిశీలన చేయాలి. అన్నీ తనకే తెలుసుననే దృష్టి వుండగూడదు.

రచనలో వైవిధ్యం, వేరు వేరు దృక్కోణాలను ప్రదర్శించేటప్పుడు గూడా చదువరిచేత యిది చదివించ గలగాలి అనే పట్టు విడవగూడదు.

చదివే వాడికి అభిరుచి దాయకం కాకపోతే పేజీలు తిప్పి పడవేస్తాడు. 'అభిరుచి' పట్టు విడవకుండా చూచుకోవడం - రచన పూర్తి స్వరూపంలో రంగరించుకు పోవాలి.

కథ - కథనం వేల సంవత్సరాల అనాది ప్రక్రియ. నిత్య నైమిత్తిక జీవితం కంటె కల్పిత కథలోని అద్భుతం చదువరిని యుగాల తరబడి కట్టిపడవేసింది - అనే విషయం మరువగూడదు. మొదటి వాక్యాలు, మాటలు యీ అభిరుచికి పట్టు కొమ్మలు. జీవిత సత్యాలు, విలువలను గురించిన ప్రస్తావన రచయిత స్థాయిని కూరుస్తుంది. చదువరికి ప్రయోజనం కలిగిస్తుంది.

కథలు రచయిత అంతరంగంలో పుడతాయి. చుట్టూ వున్న సంఘటనలు అతని అంతరంగంలో మధనం అయిన తరువాతనే కథలుగా రూపు కట్టుకుంటాయి, దిద్దుకుంటాయి.

స్ఫూర్తి ఒక పక్క, దీనిని అక్షరబద్ధం చేసే కృషి మరొక పక్క, రచయిత మనస్సు యీ రెంటినీ చక్కగా పదునుచేసి ఉపయోగించుకోగలగాలి.

ఆలుచిప్పలో పడిన నీటిబిందువులాగ, కథా వస్తువు ముత్యంలా తయారవుతుంది. తెలియకుండానే పడిన నీటి బిందువును జాగ్రత్తగా సాకి సున్నిత పరిచి ముత్యాన్ని తయారుచేస్తుంది - రచయిత మనస్సు; మేధస్సు. ఒక ఘటన కావచ్చును, ఒక దృశ్యం కావచ్చును. యేదయినా మేధస్సులో పరిణతి పొందాలి కొంతసేపు.

రచయిత చుట్టూ జరుగుతున్న అనేక సన్నివేశాలు - వాటి దర్శనం .. విశదీకరించే తీరు... యివన్నీ కథను పాకంలో పడవేస్తాయి. చికాకు కలిగించే సన్నివేశం అయినా.. దానిని సమరసంగా మలుచుకోవడంలోనే ఉపజ్ఞ వుంది. వర్ణనలు, మలుపులు, గమనంలో వంకర టింకరలు... యివన్నీ ఉపజ్ఞ అందించే పరికరాలు.

రెండూ జీవిత కోణాలే అయినా, కథ వేరు - నవల వేరు. రెంటికీ సామ్యం లేదు. కథ నిశితమైన 'బాణం' ఎక్కుపెట్టిన విసురుతో చదువరి మనస్సులోనికి, హృదయంలోనికి దూసుకుపోతుంది. దాన్లో ప్రతి మాటా కొలిచి మరీ వేయాలి. తాల్చి మరీ ఉపయోగించాలి. పద్యంగానో గేయంగానో కీర్తనగానో వ్రాసుకున్న రచన 'కథానిక' కాదు. ముందే అనుకున్నట్లుగా కథానిక వచన రచన.

తెలిసిన జీవితాన్ని - లోతుగాచూచి, మధించి కథలోనికి తీసుకు రావాలి. తెలియని జీవితాన్ని చక్కగా ఊహించి నియమబద్ధంగా రంగరించాలి. తెలిసినదయినా, తెలియనిదయినాకథాంశాలు అసంబద్ధంగా అవాస్తవికంగా వుండగూడదు.

కథను పాత్ర పుట్టుపూర్వోత్తరాలతో ప్రారంభంచేయగూడదు. కథారచన ఒక్క ఊపులో అయిపోవాలి. తరువాత కూర్చున్నప్పుడు దాన్ని సాన బట్టుకోవాలి. రాస్తున్నప్పుడే 'యిది అవసరం,

యిది అనవసరం' అన్న సంయమనం మనస్సులో పదిలంగా వుండాలి. తరువాత దిద్దుకుందాంలే - అన్న దృష్టి వుండగూడదు, తరువాత దిద్దుకోవడం ఎంతో అవసరం - తప్పనిసరి అయినా కూడా.

కథలో మలుపులు, పాత్ర ప్రవర్తన తీరుల్లో మెలికలు, సంబంధ బాంధవ్యాలలో వ్యత్యాసాలు. .. యివన్నీ కథాగమనానికి అనువుగా సాగాలి అతికించినట్లుగా వుండగూడదు.

'కథ' పరాకాష్టకు వచ్చిన సన్నివేశంతోనే ప్రారంభం కావచ్చును పాత్రచిత్రణం (Characterization) ని నిపుణంగా సాగిస్తే, ఈ పాత్ర యిలా ఎందుకు తయారయిందీ - అనే చొప్పదంటు ప్రశ్న చదువరి మనసులో మొలవదు

పాత్రల జీవిత చిత్రణం - పూర్తి వివరాలు.... యివన్నీ కథలో యివ్వడానికి ప్రయత్నించగూడదు.

కథ జరుగుతున్న వరుసలోనే - కథారచన సాగనవసరం లేదు. అయితే ఈ వెనుక ముందులను అర్థం చేసుకోగల 'స్తోమత' చదువరికి యివ్వగలగాలి కథ

సాదాసీద మనుషులు, నిరాడంబరమైనవాళ్ల జీవితం.. కథావస్తువుకాదు. వాళ్లలోని అసాధారణ ఆడంబరం కనిపింపచేసినప్పుడే కథకు విలువ యేర్పడుతుంది.

పాత్రల మనసులు యివీ అని కథకుడు చెప్పుకుంటూ పోగూడదు. ఆ మనసులకు అనుగుణంగా వాళ్ల వర్తనం చిత్రణ అవుతూ పోవాలి, రచనలో ప్రదర్శన జరగాలి గాని వ్యాఖ్యానం కాదు.

జీవిత వర్తనంలో నుంచి కథ ప్రారంభం కావాలి. 'దిగ్భ్రమ' కలిగించే సన్నివేశంతో మొదలవడం ఒక్కోమారు చదువరి ఉత్సుకతను పెంచుతుంది.

పాత్రలను చదువరికి పరిచయం చేయడంలో ఎంతో నేర్పు అవసరం. ముందే పరిచయం అయిన మనిషిని ఒక ప్రత్యేక ధోరణిలో మళ్లీ ముందుకు నెడుతున్నట్లుగా వుండాలి.

పాత్రలు ప్రధానం కథకు. చదువరికి పరిచయం అయిన పాత్రలు అయివుండాలి. పాత్రలు కదలాలి కదలబారాలి. సన్నివేశాలు పాత్రలు ఒకదాన్ని ఒకటి ఒరుసుకుంటూ వుండాలి, నడవాలి. సన్నివేశాలు అన్నీ యిదివరకు 'వర్తనం' లోనికి వచ్చినవే - యితరులు రాసివేసినవే - అయినా ప్రతి రచయిత వాటినే కొత్తగా చూపించగలగాలి.

సన్నివేశం కథకు ఆయువుపట్టు, పునాది

పాత్రలు చదువరికి నిజమయినవిగా కనపడాలి. ఊహా కల్పితం కాగూడదు. సజీవంగా తొణికిసలాడుతూ వుండాలి. పాత్రలు రచయిత భావజాలంలో పుట్టినా దానినుంచీ బయటపడి స్వతంత్రంగా మసలగాలి

రచయితకు పాత్రలు క్షుణ్ణంగా తెలియాలి. వాళ్ల అలవాట్లు, ఆలోచనలు, ధోరణులు, విచిత్ర ప్రకృతులు అన్నీ అతనికి కరతలామలకం అయివుండాలి. మనస్సులో వీటిని రూపకల్పన చేసుకున్నా రాసేటప్పుడు [illegible] కొత్తగా రూపొందాలి

కథలో సన్నివేశాలు, పాత్రలు, సంభాషణలు, ప్రవర్తన యివన్నీ యెంతో ఆచి తూచి నిడివి పెరగకుండా - Intersperse అవుతూ నడవాలి. కథ చివరి మెలిక - అపూర్వంగా వుండాలి.

ప్రధాన పాత్ర ఎప్పుడూ చురుకుగా వుండాలి స్తబ్దుగా కాదు. మరీ సాధు పుంగవులు, పరమ కిరాతకులూ కాదు పాత్రలు. స్వభావంలో మిళాయింపు అవసరం.

పాత్రలకు తగిన పేర్లు, ఉచితానుచితాలు, సార్థకాలు, నమ్మటానికి వీలయిన ధోరణిలో వుండాలి

కధకు నిడివి ఎంత?

చదువరి ఉత్సుకతను నిలిపి వుంచేంత! రచయిత తనకు తెలిసిన విషయాలన్నీ గుప్పించ కూడదు చదువరులలో ఆలోచనలను రేకెత్తించడం ముఖ్యం అతన్ని 'అనాసక్తుడు'గా రూపొందించకుండా చూచుకోవడం అవసరం. పాత్రలు 'అనూహ్యం'గా ప్రవర్తించాలి అనూహ్యతకు ఆలంబన కావాలి. ముందే నిర్ణయించుకున్నట్లు, మూసలో పోసినట్లు వుండే ప్రవర్తన (Predictable) అంతగా ఆకట్టుకోదు. ఎక్కువ పాత్రలు వద్దు. చదువరి మనస్సుతో ఆడుకోవడం కూడని పని. నాలుగయిదు పేజీల కథలో పదిపాత్రలు వుంటేస్థలం యిరుకయిపోయి, చదువరి మనస్సు గందరగోళంలో పడిపోయే ప్రమాదం వుంది. కథానికకు కేంద్రపాత్ర ఒక్కటే. ఆ పాత్ర చుట్టూ తతిమ్మా మనుషులు చేరుకుంటాయి. 'పాయింట్ ఆఫ్ వ్యూ' దృక్కోణం - దృష్ట్యా గూడ యిది తప్పనిసరి అవుతుంది.

సంభాషణలలోనే రచయిత చాకచక్యం ప్రదర్శితం కావాలి. మరింత స్పష్టంగా రూపు కట్టుకోవాలి ఏది సంభాషణ ఏది చెప్పడం...? చక చక .. చాకచక్యం.... అంతటా విస్తరించుకుంటుంది. సంభాషణలలో కూడా కథ చక చక నడవడమే కాకుండా, దృశ్య నిర్మాణం కూడా అవుతుంది. కథ చదువుతూ వున్నప్పుడు వింటూ వున్నప్పుడు కూడా 'మనోవీధి' లో యీ దృశ్యం స్థిరంగా యేర్పడాలి మనో వీధి విస్తరించటానికి వికాసం పొందటానికీ సహాయపడుతుంది కథ కథలో మాటలు - సంభాషణలు మామూలు ధోరణిలోనే వుండాలి తప్ప కృతకంగా వుండగూడదు. కథకు సంబంధం లేని సంభాషణ కృతకం. పాత్రలక్షణానికీ సంభాషణకూ పొంతన అవసరం. ప్రతి సంభాషణా కథకు 'ప్రాణం' అవ్వాలి. సంభాషణలతోనే కథంతా నడిచిపోయిన రచనలు వైవిధ్యమే కాక విన్నాణం కూడా కలుగ చేస్తాయి.

వర్ణనలు ఒక ప్రత్యేకమైన ప్రయోజనం చేకూరుస్తాయి. కథ రూపకల్పనకు దోహదం చేయడంతోపాటు - రంగుకు రుచి, రుచికి వాసన తోడు నీడగా వుండాలి. వర్ణనలు కథాగమనాన్ని కుంటు పరచగూడదు. చదువరి ఊహకు, లాలిత్యానికి సహాయపడాలి. వాతావరణ కల్పనకు వర్ణన ఎక్కువ సహాయపడాలి. మనస్సులోని ఆలోచనలకు రూపకల్పనగా వుండాలి - వర్ణన పాత్ర మనసులోని పరిణామాలను ప్రతిబింబించాలి. కథ 'నేత' అంతా వర్ణనలను చాకచక్యంగా రూపొందించడంలోనే వుండాలి. ఆకాశంలో నక్షత్రాలలాగ కథ వైశాల్యంలో మిణుకు మిణుకు మనే వర్ణనాంశాలు తళుకు తళుకున మెరవాలి. కనిపించీ కనిపించనట్లుగా ప్రత్యక్షం అవుతూ మరుగయిపోతూ వుండాలి. అదే పనిగా 'ప్రకృతి వర్ణన' చేసుకుంటూ పోయే ప్రబంధంలా తయారవగూడదు కథానిక.

నిదానంగా చదివించే కథలు ... చక చకా సాగిపోయే కథలు ... వుంటాయి. అడుగుల నడకలు, పరుగులు విస్తృతంగా నిర్ద్వంద్వంగా కథా గమనాలతో 'లీనం' కావాలి.

ఉద్రేకాలతో తాదాత్మనం పొందిన మనుషులు, వాళ్ల వర్తనంలో తటస్థపడే జాగులు, వాటిలో బాగోగులు బాగా ప్రదర్శితం కావాలి.

పాత్ర మనస్సు, తదుపరి మనస్సు ఉన్మీలనం అవ్వాలి - చదువుతున్నంతసేపూ - కనీసం. కథను 'బిల్డప్' చేయడం, నిర్మాణ వాతావరణం కూర్చడం... యిదీ శిల్పదృష్టి. కథా స్వరూపం చదివేవాళ్ల

మానసంలో ఒకసారి కలిసిపోతే, తిరిగి అదే మనోక్షేత్రం చదువరికి తెలియకుండానే పైకి ఉబికి వస్తూ వుంటుంది మళ్లీ మళ్లీ అదే కథను చదవాలనిపించడం యిందువల్లనే.

కథ తెలిసిందే అయినా, ప్రతిమారు తృప్తిగా తీరుబడిగా చదువుకునే ఆనంద భాగ్యం కలిగించాలి 'గొప్ప' కథానిక.

కథను ఎక్కడ ముగించాలి! - ఇది ఒక ప్రత్యేకాంశం.

మానవ జీవితానికి ముగింపులేదు, ఉన్నట్లు ఎంత ప్రగాఢంగా కనిపిస్తూ వున్నా మరచిపోయినవి మళ్లీ మళ్లీ మనసుల్లో ప్రత్యక్షం అవడం జరుగుతుంది.

ప్రారంభం అయిన ప్రతిదీ ముగింపు పొందాల్సిందే. అయినా ఆ ముగింపు అంతా కృతకం, పాక్షికమే. ముగింపు చేసేపని - కథా సన్నివేశాన్ని పరిపూర్ణం చేయడం. 'ముడి' విడిపోవడం ముగింపు- ముగింపు మళ్లీ ప్రారంభం కావచ్చును. ఇది చదువరి ఊహకు వదలివేయ వలసిన విషయం కథకు పరిమితి వుంది.

పరిమితి - పరిణామం - వున్నాయి.

ముగింపు - పునః ప్రారంభం ... యిలా వలయంలా గిరగిరా తిరుగుతాయి జీవితంలో కథలు.

ఈకథ ముగిసి పోవడమే యుక్తమైన ముగింపు - అనే తృప్తిని తీసుకురావాలి కథానిక చదువరి మనస్సుకు.

కథకు ప్రయోజనం వుందా? - దీనివల్ల సమాజం మారిపోతుందా? -

కాలక్షేపం కోసం చదివి పారవేసేదేగదూ, కథానిక - అనుకుంటారు చాలామంది.

కథకు కరెన్సీ (Currency) ఒక వారం... ఒక నెల... ఒక సంవత్సరం... ఒక తరం.. అనేక తరాలు... అని యిలా అంచనా వేసుకుంటూ వుంటారు. బాహుళ్యం ( రాశి) వచ్చి మీద పడుతున్నది గనుక ఒక్కో కథ ప్రయోజనం కూడా పరిమితమే అనుకోవటానికి వీలు లేదు.

ప్రభావం కొలవటానికి వీలులేనిది. అలాగని కొలతలు లేనిదీకాదు. అభి ప్రాయాల ప్రచారంకోసం కథ వ్రాసిన 'శిల్పదృష్టి' తగినంతగా వుంటే ప్రయోజనం గురించి యిలాంటి చిన్న చిన్న కుశ్శంకలు మనసును వేధించవు.

వస్తు ప్రాధాన్యం, రూప సామరస్యం మీద ఆధారపడి కథానిక సర్వదేశ దశకాలాలకూ అన్వయించే సుసందర్భం యేర్పడుతుంది.

మానవజీవితంలో ప్రతి పనికీ, ప్రతి ఉనికికీ ఒక ప్రయోజనం వుంది. కథారచన, కథా పఠనం యిందుకు మినహాయింపు కాదు. ప్రతి దానికీ పరిమితి వున్నట్లే దానికీని.

కథ ప్రభావం తదుపరి మానసిక వాతావరణాన్ని పెన వేసుకు పోయి అతన్ని 'ఆలోచన పరుడి' ని చేస్తుంది. దీనికోసం ప్రత్యేకంగా వెదకడం అనవసరం. వెదకడం మొదలయితే, అసలు వస్తువు మటుమాయం అయిపోతుంది.



CAT MAN : Craig Wagner, who has 15 big cats, gets a royal hug from a white tiger, Taari, at his home in Forest Lake, Minnesotta

